# నిజాంరాష్ట్ర పరిపాలనము



## దేశీయ సంస్థానములు



ప్రపంచములో మన హిందూదేశము, గొప్ప దేశమై యున్నది. ఈ హిందూదేశమును ఇంగ్లీషువారు జయించిపాలించుచున్నారు. కాని దేశమంతటను అక్కడక్కడ కొన్ని దేశీయ సంస్థానములు ఇంగ్లీషు ప్రభుత్వాధీనములో నున్నవి. మన హైద్రాబాదు (నిజాము) రాష్ట్రము దేశీయ సంస్థానములన్నింటిలో వైశాల్యమునుబట్టి, జనసంఖ్యనుబట్టి, ఆదాయమునుబట్టి, పెద్దదియు, అగ్రగణ్యమైనదియునై యున్నది. హిందూస్థానములో స్వదేశ సంస్థానములు చిన్నవి పెద్దవి కలసి (౫౬౨) కలవు. ఈసంస్థానము లన్నియు బ్రిటిషు వారికి సామంత రాజ్యములై యున్నవి. ఈ సంస్థానాధిపతులకు స్వతంత్రాధికారము లన్నింటిలో లేవు. వారితర దేశములతో సంధికాని వ్యవహారములుకాని స్వతంత్రముగా గావించుకొన జాలరు. వారు తమ ఖర్చులతోనే సైన్యమును సిద్ధముగానుంచుకొనవలెను. అనేక సంస్థానములలో రెసిడెంటు అను ఇంగ్లీషు అధికారి బ్రిటిషు ప్రభుత్వపు ప్రతినిధిగా సంస్థానములలో నేర్పాటుఅయియున్నాడు. చిన్న చిన్న సంస్థానములలోకి మిషనర్లు జిల్లాకలెక్టర్లు బ్రిటిషు ప్రభుత్వపక్షమున ఏర్పాటయియున్నారు. కొన్ని పెద్ద సంస్థానముల యొక్క వైశాల్యము, జనసంఖ్య, రాష్ట్రాదాయము ఈ క్రింది విధముగా

| సంస్థానము | వైశాల్యము | ఆదాయము సాలీనా | గౌరవార్థము కాల్చు తుపాకులు | జనసంఖ్య | బ్రిటిషువారికిచ్చు కప్పము |
|---|---|---|---|---|---|
| హైదరాబాదు* | ౮౨౬౯౮ | ౮,౧౭,౬౨,౦౦౦ | ౨౧ | ౧,౪౪,౩౬,౧౪౮ | |
| మైసూరు | ౨౯౪౭౫ | ౩,౫౧,౬౧,౮౦౦ | ౨౧ | ౬౫,౫౭,౮౭౧ | ౨౫ [illegible] క్షలు |
| కాశ్మీరు (జమ్ము) | ౮౫౮౮౫ | ౨,౩౦,౫౫,౦౦౦ | ౨౧ | ౩౬,౪౬,౨౪౩ | ౨ [illegible] శాలువలు 3 రుమాలలు |
| బరోడా | ౮౧౬౪ | ౨,౬౦౯,౦౦౦ | ౨౧ | ౨౪,౪౩,౦౦౭ | ౩,౭౫,౦౦౦ |
| తిరువాన్కూరు | ౭౬౨౫ | ౨,౪౧,౩౬,౦౦౦ | ౧౯ | ౫౦,౯౫,౯౭౩ | ౮,౧౦,౩౧౯ |
| కొచ్చిన్ | ౧౪౧౭½ | ౮౮,౩౭,౦౦౦ | ౧౭ | ౧౨,౦౫,౦౧౬ | |
| పటియాలా | ౫౯౪౨ | ౧,౪౫,౩౦,౦౦౦ | ౧౭ | ౧౬,౨౫,౫౨౦ | |
| ఇండూరు | ౯౯౦౨ | ౧,౨౪,౨౧,౦౦౦ | ౧౯ | ౧౩,౨౫,౦౮౯ | |
| భూపాల్* | ౬౯౨౪ | ౮౦,౦౦,౦౦౦ | ౧౯ | ౭,౧౯,౯౫౫ | ౧౬౧౨౯౦-౫ |
| టోంక్* | ౮౯౨½ | ౪౯,౧౭,౦౨౫ | ౧౭ | ౪,౬౪,౯౧౯ | |
| కొల్హాపూరు | ౩౨౧౭ | ౭౭,౦౦,౦౦౦ | ౧౯ | ౯,౫౭,౧౩౭ | |
| ఆల్వారు | ౩౧౫౮ | [illegible]౭,౦౦,౦౦౦ | ౧౫ | ౭,౪౯,౭౫౧ | |
| బికానీర్ | ౨౩౩౧౭ | ౧,౨౧,౬౬,౦౦౦ | ౧౭ | ౯,౩౬,౨౧౮ | |

| | | | | | |
|---|---|---|---|---|---|
| కాలట్ * | ౭౨౨౭౮ | ౧౨,౫౭,౦౦౦ | ౧౯ | ౩,౪౨,౧౦౧ | |
| భూటాన్ | ౧౮౦౦౦ | ౪,౦౦,౦౦౦ | ౧౫ | ౩,౦౦,౦౦౦ | |
| రేవా | ౧౩౦౦౦ | ౬౦,౦౦,౦౦౦ | ౧౭ | ౧౫,౮౭,౪౪౫ | |
| బస్తర్ | ౧౫౨౩౭ | ౯,౨౨,౦౦౦ | | ౫,౨౪,౭౨౦ | ౧౭,౨౦౦ |
| గ్వాలియర్ | ౨౬౩౬౭ | ౨,౪౧,౭౯,౦౦౦ | ౨౧ | ౩౫,౨౩,౦౭౦ | ౫౪,౦౫౪ |
| భావల్పూరు | ౧౬౪౩౪ | ౪౫,౫౦,౦౦౦ | ౧౭ | ౯౮౪,౬౧౨ | |
| జైపూరు | ౧౫౫౭౯ | ౧,౨౦,౦౦,౦౦౦ | ౧౭ | ౨౬,౩౧,౭౭౫ | ౪,౦౦,౦౦౦ |
| జోధ్పూరు | ౩౫౦౧౬ | ౧,౪౦,౧౧,౦౦౦ | ౧౭ | ౨౧,౨౫,౯౮౨ | ౨,౧౩,౦౦౦ |
| ఉదయపూరు | ౧౨౬౯౪ | ౬౫,౭౯,౦౦౦ | ౧౯ | ౧౫,౬౬,౯౧౦ | ౨,౬౬,౦౦౦ |
| కూచ్ బిహార్ | ౧౦౧౮ | ౨౭,౩౨,౧౦౦ | ౧౩ | ౫,౯౦,౮౬౬ | ౬౭౭౦౦-౧౫-౦ |
| త్రిపురా | ౪౧౧౬ | ౩౦,౪౩,౦౦౦ | ౧౩ | ౩,౮౨,౪౫౦ | |

* ఈగుర్తు కలవి ముసల్మాను సంస్థానములు

మొత్తము సంస్థానములు (౫౬౨) ఇందుచాలపెద్దవి ౧౦౮ మధ్యరకమువి ౧౨౭, జాగీర్లు ౩౨౭

వీనివైశాల్యము• ౭౧౧౦౩౨ చదరపు మైళ్లు

జనసంఖ్య, (౮౧౩౧౦౮౩౫.)

ఈ దేశీయరాజ్యములలో• మైసూరు, బరోడా, తిరువాన్కూరు కొచ్చిన్, అనునాలుగుసంస్థానములు చాల అభివృద్ధినొంది దేశమంతటను విఖ్యాతిగాంచినవి.

దేశీయ సంస్థానములలో విద్యావ్యాపకము చాలహీనముగానున్నను కొన్నిసంస్థానములలో మాత్రము బ్రిటిషిండియానుగూడ మించిపోయినది. కొన్ని ముఖ్య సంస్థానములలో విద్యావంతుల సంఖ్య,

వేయింటిలో చదువువచ్చినవారు

| | సంస్థానము— | పురుషులు— | స్త్రీలు— |
|---|---|---|---|
| ౧ | తిరువాన్కూరు ... | ౪౦౮ ... | ౧౬౮ |
| ౨ | కొచ్చిన్ ... ... | ౩౮౦ ... | ౫౦౪ |
| ౩ | బరోడా ... ... | ౩౩౧ ... | ౭౯ |
| ౪ | మైసూరు ... ... | ౧౭౪ ... | ౩౩ |
| ౫ | హైద్రాబాదు ... | ౮౫ ... | ౧౨ |
| ౬ | గ్వాలియరు ... | ౬౦ ... | ౭ |
| ౭ | కాశ్మీరు ... | ౫౯ ... | ౫ |

ఇంచుమించు నూటికి ౯౯ సంస్థానములలోని ప్రజలు బ్రిటిషుహిందూదేశ ప్రజలకన్న చాలవెనుక బడినారు. హక్కులుకూడ చాలకొద్దిపాటివే. దేశీయ రాజ్య ప్రజలయొక్క కష్టములను గురించి, వారియెడ కావింపవలసిన రాజకీయ సంస్కరణములనుగురించి జగద్విఖ్యాతిగాంచిన సర్ మోక్షగుండం విశ్వేశ్వరయ్యగారు దక్షిణ ఇండియా స్వదేశీరాజ్యముల మహాసభాధ్యక్షోపన్యాసము నందు (౧౨ జనవరి ౧౯౨౯ సం) ఇట్లుసెలవిచ్చిరి.

"బరోడా, హైదరాబాదు, మైసూరు, తిరువాన్కూరు, రాజపుత్రస్థానమందలి దేశీయరాజ్యములు, కథియవాడులందుండు దేశీయసంస్థానములు మున్నగు సంస్థానముల ప్రజలు బ్రిటిషు ప్రభుత్వమువారి అనుమోదముతో తమ తమ ప్రభువులను అడిగి పరిపాలన విషయములలో ప్రజాప్రతినిధులకు బాధ్యమైయుండు ప్రభుత్వమును సాధించుటకై, యిటీవలకొన్ని సంవత్సరములనుండి సభలు జరుపుచున్నారు. ఇట్లు చేయుటకు వారికి హక్కులేదని చెప్పవీలులేదు. సంస్థానముల ప్రజలు మహాసభలు జరిపియు, కమిటీలను (చిన్న సంఘములను) సమావేశపరచియు తమ హృదయగతములైన అభిప్రాయములను వెల్లడిచేయుటకు ప్రారంభించినది యిటీవల కొద్దిసంవత్సరముల నుండియే. వారిస్థితిని చక్కబఱచు అధికారస్థుడు ఎవడుగాని లేనందువలన, వారందరు సంయుక్తులై, అవసరమైన ధనమును కూర్చుకొని న్యాయములైన తమకోరిక లన్నియు ఇయ్యబడువరకు చురుకైన నాయకులు చెప్పిన ప్రకారము పనిచేయుట యుక్తము-

చాలసంస్థానములలో ప్రజల అవసరములేవో సరిగాకనుగొనక యే ప్రభుత్వాదాయము వ్యయముచేయబడుచున్నది.

ఇపుడు భారత సంస్థానములన్నియు మధ్యయుగ కాలపుపద్ధతుల ననుసరించి పాలించబడుచున్నవి. నేటిప్రపంచ మందెక్కడగాని మధ్యయుగపు పద్ధతుల ననుసరించి పరిపాలించబడు యేరాజ్యముగాని గొప్పఅ కారమును, ధనమును జ్ఞానమును అనుభవించు దశకు వచ్చినదిలేదు.

"పలుకుపడి లేకుంటే పన్నులేదు,, (No taxation without representation) అను సూత్రము నాగరిక ప్రపంచమందు ప్రభుత్వములన్నియు అంగీకరించినట్టిదే. సంస్థాన ప్రజలుతమతమ ప్రభుత్వములకు పన్నులు చెల్లించుదురు గనుక, ఆప్రజలకు తమ ప్రభుత్వముల ధనవ్యయ మందును, వారి పరిపాలనారీతి నిర్ణయమందును అభిప్రాయమిచ్చుటకు అవకాశము గలియుండవలెను. కొన్ని సంస్థానముల

ప్రభుత్వములు అతిప్రాచీనములైన యేకచ్ఛత్రాధిపత్యముల బోలి యున్నవి. మనకు యింకను యేకచ్ఛత్రాధిపత్యము కావలసియున్నచో, అది ఉత్తమపక్షము నవీనకాలపుదానివలె నుండవలెను. నవీన కాలమున నుండు యేకచ్ఛత్రాధిపత్యము శాసన బద్ధమైనది, ప్రజా ప్రతినిధులచే పరిపాలనాకార్యములు నిర్వహించ బడుటకు యిందేర్పాట్లు గలవు.

బాధ్యతాయుత ప్రభుత్వమునకీ క్రిందిలక్షణములు ముఖ్యముగనుండ వలెను:—

(౧) ప్రతిరాజ్యములోను ప్రజలచే నెన్నుకొనబడిన సభ్యులుగల శాసన సభ అధమపక్షము ఒకటియైనను ఉండవలెను. (౨) శాసనసభలో ఒకశాఖమాత్రమే ఉన్నప్పుడు సంస్థాన మందలి సుప్రసిద్ధ విద్యావంతులనుండి సుమారు ౨౫ మందిని గౌరవసభ్యులనుగా సంస్థానాధిపతి యేరుకొనవలెను. గొప్పవిపత్సమయములలో ముఖ్యముగా శాసనసభ రాష్ట్రముయొక్క ప్రధాన క్షేమమునకు విరుద్ధమైన వైఖరి నవలంబించినదని సంస్థానాధిపతికి తోచినప్పుడు, ఆయన యీగౌరవసభ్యులసంఘముయొక్క సలహాను పొందవచ్చును. (౩) కార్యనిర్వాహక వర్గము యొక్క అనగా, మంత్రివర్గముయొక్క సభ్యులను శాసన సభనుండి గ్రహించ వలెను. ఆవర్గము శాసనసభకు బాధ్యమై యుండవలెను. ప్రధానమంత్రి సంస్థానాధిపతి కిష్టుడైన వాడుండవచ్చును. (౪) సంస్థానాధిపతియొక్క సొంతఖర్చులుఒకటేసారి నిర్ణయించబడి యుండవలెను. అసాధారణ సందర్భములందు అతనికై చేయబడు ఖర్చు శాసనసభవారి ఆమోదమును పొందవలెను. (౫) న్యాయవిచారణ శాఖపై కార్యనిర్వాహక శాఖయొక్క అధికారమేమియు నుండరాదు. (౬) బాధ్యతాయుత ప్రభుత్వమును ప్రవేశపెట్టునప్పుడుగాని, పెట్టిన తర్వాతగాని సంస్థానాధిపతి తనప్రజలకు యీక్రింది ప్రధానహక్కులు గలవనిస్పష్టముగ ప్రకటించవలెను:—

వాక్స్వాతంత్ర్యము, ధనస్వాతంత్ర్యము, ఆత్మస్వాతంత్ర్యము, పత్రికల స్వాతంత్ర్యము.(2) ప్రతిరాష్ట్రి ప్రభుత్వమున్ను విధిగా చేయవలసిన కృత్యములలో యితరులపై ఆధారపడకుండ జీవించుటకు ఆవశ్యకములగు రాజ్యాభివృద్ధి కార్యములు విద్య, పరిశ్రమలు, రాజ్య సంరక్షణము, స్వరాజ్యము అనునంతవరకై నను చేర్చబడవలెను. ఈకార్యములను గూర్చి అధమపక్షము సంవత్సరమున కొక సారియైనను ఆకాలములో జరిగిన పనిని తెలుపు నివేదికలను తయారు చేయవలెను."

## నరేంద్ర మండలి (Chamber of Princes)

దేశీయ రాజ్యముల పక్షమున నొక సభ ౧౯౨౧లో ఏర్పాటు చేయబడెను. దీనినే నరేంద్ర మండలి యనినారు. ఈమండలి అప్పుడప్పుడు సమావేశ మగును. దీనియుద్దేశములు

(౧) బ్రిటిషు ప్రభుత్వమునకు దేశీయ రాజులు తమ కోరికలను తెలుపుకొనుట

(౨) తమదృక్పథము విశాలముగా చేసికొనుట

(3) ఒకరి తో నొకరు సంప్రతించు కొనుట

(४) బ్రిటిషు ప్రభుత్వముతో సంప్రతించు కొనుట

దీనిలో చర్చించు విషయములు

(౧) దేశీయ రాజ్యముల సమస్యలు

(౨) బ్రిటిషిండియాకును లేక సామ్రాజ్యమునకును దేశీయ రాజ్యములకును సంబంధించిన సమస్యా చర్చలు.

ఇందిప్పుడు ౧౦౯ దేశీయాధిపతులు స్వయముగా సభ్యులుగాను మరియు ౧౨ గురు అధిపతులు౧౨౭ చిల్లర సంస్థానముల పక్షమునను మొత్తము ౧౨౧ సభ్యులుకలరు. దీని అధ్యక్షులను ఛాన్సలర్ అందురు. ఛాన్సలరున్ను, సహాయ ఛాన్సలరున్ను, కార్య నిర్వాహక వర్గమున్ను ఈసభ్యులనుండి ఎన్నుకొనబడుదురు.

# నిజాంరాష్ట్రము.

ఇంతవరకు వ్రాసినదాని వలన బ్రిటిషువారి అధీనములోనుండు ముఖ్యసంస్థానములను గురించి కొంత తెలిసికొంటిమి. ఇకమన నిజాంరాష్ట్రమును గురించి ముఖ్యముగామనము తెలిసికొన వలసియున్నది. మన రాష్ట్రమును గురించి మనలోచదువు కొనిన వారు కూడ బాగుగానెరుగరు. మరియు బ్రిటిషు హిందూదేశము లోని విద్యావంతులుకూడ మనరాష్ట్రపు స్థితిగతులెరుగరు. కావున మన రాష్ట్రమును గురించిన ముఖ్యవివరములను వ్రాయుచున్నాము.

మొట్టమొదలు మనరాష్ట్ర చరిత్రను కొంత తెలుసు కొనవలెను. ఈరాష్ట్రములో రెండుభాగము లున్నవి. (౧) తెలంగానా (౨) మరాట్వాడా. మొదటి దగు తెలంగానాలో ఆంధ్రులున్నారు. తెలంగానా అను పదము త్రిలింగ అనుశబ్దమునుండి ఏర్పడినది. త్రిలింగ దేశము అనగా తెలుగు దేశము ప్రాచీనమునుండి యేర్పడినది. పూర్వకాలములో త్రిలింగ దేశము సరిహద్దులు (౧) ద్రాక్షారామము, (౨) కాళేశ్వరము (౩) శ్రీశైలము. ఈమూడును శైవక్షేత్రములు. ఇచ్చట శివలింగము లుండి నందున ఈమూడులింగముల మధ్యనుండు దేశ మగుటచేత ఈదేశమును త్రిలింగదేశమనినారు. త్రిలింగ అను పదమునుండియే తెలుగు అను పదమేర్పడినది. ఈమూడులింగ క్షేత్రములలో కాళేశ్వరము అనునది కరీంనగరు జిల్లాలోని మంథెన తాలూకాలో మనరాష్ట్రపు సరిహద్దునను న్నది. శ్రీశైలమనునది కర్నూలు జిల్లాలోనిది. మనరాష్ట్రములోని మహిబూబునగరు జిల్లాలోని అమరాబాదు తాలూకా సరిహద్దులోనున్నది. ద్రాక్షారామము గోదావరి జిల్లాలోనున్నది. కావున ఉత్తర సర్కారులు, రాయలసీమ అనబడు కర్నూలు కడపఅనంతపురము బళ్లారి, జిల్లాలు చిత్తూరు, నెల్లూరు, గుంటూరు చెంగల్పట్టుజిల్లాలున్న మనరాష్ట్రములోని తెలంగానా భాగమును కలిసి ఆంధ్ర దేశమనిపించుకొనును.

మన రాష్ట్రము విశేషభాగము ప్రాచీనమందు శాలివాహనునిచేతను అతని సంతతిచేతను పాలింపబడెను. తర్వాత రాష్ట్రకూటులు (అనగా యిప్పటి రెడ్లపూర్వికులు) రాజ్యముచేసిరి. అటు తర్వాత ఓరుగల్లు రాజ్యముచేసిన కాకతీయులీ దేశము నేలిరి. అటు తర్వాత గోలకొండరాజ్యమును స్థాపించి కుతుబుషాహీ నవాబులు రాజ్యముచేసిరి. ఈనవాబులను ఔరంగజేబు ఓడించి తన ఢిల్లీ సామ్రాజ్యములో చేర్చికొని ఆసఫ్జా అను సూబేదారును నియమించెను. ఔరంగజేబు చనిపోయినవెంటనే ఆసఫ్జా తన స్వాతంత్ర్యమును ప్రకటించి స్వతంత్ర రాజయ్యెను. ఆసఫ్జా ౧౭౪౮ క్రీ. శ. లో చనిపోయెను. ఆనాటినుండి అతనివంశమువారే (ఆసఫ్జాహీవంశమువారే) ఈ రాష్ట్రమును పరిపాలించుచున్నారు. ఆసఫ్జా తర్వాతకాలములో మహారాష్ట్రులు కొంతకాలము చౌత్ అను పన్నును వసూలు చేసుకొనుచుండిరి. కొంతకాలము ఫ్రెంచివారు ఈరాష్ట్ర నవాబులను వశపరచుకొనియుండిరి. తర్వాత ఇంగ్లీషు వారు ప్రవేశించి వీరితో స్నేహముచేసిరి. ఇంగ్లీషువారితో స్నేహమైననాటినుండి మనరాష్ట్రపు నవాబులు ఇంకెవ్వరితోను సంబంధముకలిగించుకొనక మంచికి చెడ్డకు అన్నిటికి ఇంగ్లీషువారితో కలిసియుండిరి. అందుకొరకే మన నవాబులకు "విశ్వాసపాత్రుడైన మిత్రుడు" (Faithful ally) అను బిరుదముదొరికినది.

### మనరాష్ట్ర నవాబుల క్రమము

### ఆసఫ్జా. క్రీ. శ. ౧౭౧౩ నుండి ౧౭౪౮ వరకు

ఈరాష్ట్రపు మొదటిపరిపాలకు లిదివరకే చెప్పినట్లు ఆసఫ్జా. వీరికే నిజాముల్ముల్కు అను బిరుదుండెను. ఆ బిరుదులో నిజాము శబ్దమే తర్వాతకాలములో హైద్రాబాదు పాలకుల బిరుదమ్యెను. నిజాముల్ముల్కు అనగా దేశముయొక్క విచారణ చేయునతడు. ఈ నిజాముల్ముల్కు ఆసఫజాను ౧౭౧౩ క్రీ. శ.లో

ఢిల్లీచక్రవర్తి తనవైసిరాయగా దక్కనులో నేర్పాటుజేసెను. అతని యనంతరము

## సలాబత్ జంగు. క్రీ. శ. ౧౭౪౮—౧౭౬౧

అతనికుమారులలో రాజ్యాధిపత్యమునకై తగవులేర్పడెను. అందు ఫ్రెంచి, ఇంగ్లీషువారు పక్షములవలంబించి ప్రోత్సాహము చేసిరి. తుదకు పరాసు బూసీసహాయమున సలబత్ జంగు అను మూడవకుమారుడు ప్రభువయ్యెను. ఇతని కాలముననే ఇంగ్లీషు వారు ఇతనివద్దనుండి మచిలీపట్టణమను [బందరు] రేవును లాగుకొనిరి. ఇతడనేకమారులు మహారాష్ట్రులతో పోరాడి యోడిపోయెను.

## నిజామలీఖాన్. ౧౭౬౧—౧౮౦౩

క్రీ. శ. ౧౭౬౧ వ సంవత్సరములో నితనితమ్ముడగు నిజామలీఖాను రాజ్యము నాక్రమించుకొనెను ఇతడు మహారాష్ట్రులతో స్నేహముచేసికొనెను. ఇంగ్లీషువారితో సంధిచేసికొని ఏటేట ౯ లక్షలరూపాయలకప్పము కట్టనొప్పుకొనెను. ౧౭౬౭ లో హైదరలీతో కలిసి యింగ్లీషువారికి విరుద్ధుడయ్యెను కాని మరుసటి సంవత్సరమే సంధిచేసుకొనెను. ౧౭౭౯ లో తనఅన్నయగు బసాలత్ జంగుకు గుంటూరు నియ్యవలసివచ్చెను. ౧౭౯౫గిలో నితనికిని మహారాష్ట్రులకును "ఖుర్ద్లా" వద్ద యుద్ధము జరిగెను. అందు నిజాము ఓడిపోయి దౌలతాబాదుకోటను, మరియు ఏటేట 3౫ లక్షల ఆదాయము వచ్చు రాజ్యమును వారికిచ్చెను. యుద్ధము ఖర్చులకని 3 కోట్ల రూపాయిలిచ్చుకొనెను. ౧౭౯౮ లో మరల ఇంగ్లీషువారితో సంధిచేసుకొని యిక ముందు ఫ్రెంచివారితో తన సంబంధముండనేరదని యొప్పుకొనెను. ౧౭౯౯ లో టిప్పూసుల్తానుతోటి యుద్ధములో ఇంగ్లీషువారికి నిజాము సాయపడెను. ౧౮౦౦ లో మరల ఇంగ్లీషువారితో క్రొత్తసంధి కావించుకొని దాని ద్వారా ౬,౦౦౦ కాల్బలము ౯ ౦౦౦ గుఱ్ఱపుబలముతో ఎల్లప్పటికిని

ఇంగ్లింషువారికి సహాయపడునట్లొప్పుకొనెను. ఇతడు ౧౮౦౩ లో చనిపోయెను.

## సికిందర్ జా. ౧౮౦౩—౧౮౨౯

ఇతని కుమారుడు సికిందర్ జా ప్రభువయ్యెను. ఇతని కాలములో ౨వ మరాటాయుద్ధము ౩ వ మరాటాయుద్ధమును జరిగెను. ఈ రెంటిలోను నిజాము సైన్యము ఇంగ్లీషువారికి తోడ్పడెను. నిజాం సైన్యముయొక్క శిక్షణ బాగుగాలేదని ఇంగ్లీషువారి యధీనమయ్యెను. [ఇదేవిధముగా జరుగుచు తుదకు ౧౯౦౩వ సం॥న బ్రిటిషుఇండియా సైన్యములో నిజాము సైన్యముచేర్పబడెను] ఈ నిజాము కాలములోనే ఇంగ్లీషు అధికారులు మాల్గుజారీ, పోలీసు శాఖలలో మొట్టమొదలు ఏర్పాటుచేయబడిరి. ఇతడు ౧౮౨౯ లో చనిపోయెను.

## నాసిరుద్దౌలా. ౧౮౨౯—౧౮౫౭

ఇతని కుమారుడు నాసిరుద్దౌలా ప్రభువయ్యెను. ఇతని కాలములోనే బీరారు జారిపోవుటకు మొదలయ్యెను. ఖర్చులు విశేషమై సైన్యముజీతాలు వగైరా క్రీ. శ. ౧౮౫౨ వరకు ఇవ్వనందున బీరారును ఇంగ్లీషువారు తీసికొనిరి. ఇతడు క్రీ. శ. ౧౮౫౭లో చనిపోయెను.

## అఫజలద్దౌలా. ౧౮౫౭—౧౮౬౯

ఇతని కొడుకు అఫజలద్దౌలా రాజయ్యెను. ఇతని కాలమందే ౧౮౫౭ క్రీ. శ. లో సీపాయి తిరుగుబాటు [గదర్] జరిగెను. ఈగదరులో నిజాముగారు సాయపడినందున షోరాపూరు వీరికియ్యబడెను. మరియు ౫౦ లక్షల అప్పు ఇంగ్లీషువారి కియ్యవలసినది రద్దుచేయబడెను.

## మీర్ మహబూబలీఖాన్ ౧౮౬౯—౧౯౧౧

వీరి యనంతరము ౨౯ ఫిబ్రవరి ౧౮౬౯ లో మీర్ మహబూబ్ అలీఖాను పట్టాభిషిక్తులైరి. వీరు మైనరు అగుటచే

సర్ సాలార్‌జంగుగారు మంత్రియై రాజ్యము పాలించిరి. ౧౮౮౪ లో నిజాముగారికి పరిపాలనాధికారమియ్యబడెను.

౧౮౯౩లో నిజాముగారు శాసనసభను ఏర్పాటుచేసిరి. ఈ శాసనసభలో నీ క్రిందివారేర్పాటు చేయబడిరి.

మీర్‌మజ్లిస్. (ప్రధానన్యాయమూర్తి)
ఒక హైకోర్టు రుకున్. (న్యాయాధికారి)
నాజిం మాల్గుజారి.
నాజిం విద్యాశాఖ.
నాజిం జిల్లాపోలీసు.
మోతెమద్ ఫైనాన్సు. (ఆర్థికశాఖాకార్యదర్శి)

౧౯౦౨ వ సం॥ లో నిజాముగారు బీరారును శాశ్వతముగా బ్రిటిషుప్రభుత్వమునకు కౌలునకిచ్చునట్లును బ్రిటిషువారందుకై ప్రతి సం॥ ము ౨౫ లక్షలు ఇచ్చునట్లును ఒడంబడిక జరిగె. ఈ నిజాము గారు ౨౯ ఆగస్టు ౧౯౧౧లో చనిపోయిరి.

మ. ఘ. వ. నవాబ్.

సర్ మీర్ ఉస్మానలీఖాన్ బహాదరుగారు.

వారి కుమారులును ప్రస్తుత ప్రభువుగారును అగు మ.ఘ.వ. నవాబు మీర్ ఉస్మానలీఖాన్‌బహద్దరుగారు సింహాసనాధిష్ఠులైరి. బిరుదులతోకూడ వీరిపూర్తినామమిట్లున్నది.

"లెఫ్టినెంట్ జనరల్ హిజ్ ఎక్జాల్టెడ్ హైనెస్ ఆసఫ్‌జాః ముజప్ఫరుల్‌ముల్కు వల్‌ముమాలిక్ నిజాముల్‌ముల్కు నిజాముద్దౌలా నవాబ్ సర్ మీర్ ఉస్మానలీఖాన్ బహాదర్ ఫతేజంగ్ ఫేయిత్‌ఫుల్‌అలై జి. సి. యస్. ఐ. జి. బి. ఇ. నిజాం హైద్రాబాదు."

ఉర్దూలో పై బిరుదులతోసహా యీ క్రిందివికూడ చేర్చి యున్నారు.

"ఆలాహజరత్ బందగానేలీ ముతాలీ జిల్లల్లాఫుర్ నూర్,
సుల్తానుల్ ఉలూంఖైసరె దక్కన్."

మన ప్రభువుగారి కాలములో అనేక రాజ్యాంగ సంస్కరణములు, అనేకాభివృద్ధులు జరిగినవి.

అందుముఖ్యమైనవి:—

౧. హైదరాబాదునగరములో హైకోర్టు ఉస్మానియా హాస్పిటల్, ఉస్మానియా విద్యాపీఠము, మున్నగునవి కట్టుట.

౨. రాజవీధు లేర్పడుట.

౩. అనేక తటాకములు నిర్మింపబడుట. అందు ముఖ్యమైనవి— ఉస్మాన్‌సాగర్, నిజాంసాగర్, హిమాయత్ సాగర్.

౪. బాంకె హుకూమతు స్థాపింపబడుట.

౫. న్యాయశాఖ, కార్యనిర్వాహకశాఖ వేరుజేయబడుట. [ఇది ౯ మే ౧౯౨౧లో గావింపబడెను.]

౬. ఉర్దూభాషాభివృద్ధి అపారముగా కావింపబడుట.

౭. రైలుమార్గములు, బాటలు, విశేషముగా వేయింపబడుట.

మనప్రభువుగారు యూరోపుయుద్ధమునకుగాను సుమారు ౧½కోటిరూపాయిలిచ్చి మరియు సుమారు ౪౦ లక్షలు ఇంగ్లాండులో యుద్ధమందునష్టపడిన వారి సహాయార్థమిచ్చిరి. ఇంతేకాక ౧ కోటి ౬౪ లక్షలు యుద్ధ ఋణమునకుగాను యిచ్చిరి. బ్రిటిషిండియాలోని విద్యాసంస్థలకును ఆసుపత్రులకును, యూరోపులోని సంస్థలకు, అరేబియావంటి దేశములలోనిసంస్థలకు మాసవేతనముల మూలముగా అనేక లక్షలమొత్తమును దానము జేసియున్నారు.

## కొన్ని అంకెలు

హైద్రాబాదు రాష్ట్రజనసంఖ్య మొత్తము ... ౧౪౪౩౬౧౪౮.

అందులో

| | | |
|---|---|---|
| హిందువులు (బ్రాహ్మణీయ హిందువులు) | ... | ౯౬౯౯౬౧౫. |
| ఆదిహిందువులు | ... | ౨౪౭౩౨౩౦. |
| ఆర్యులు | ... | ౩౭౦౦. |
| బ్రిహ్మోలు | ... | ౧౮౨. |
| | (మొత్తం— | ౧౨౧౭౬౭౨౭. |
| బౌద్ధులు | ... | ౫౨. |
| ముసల్మానులు | ... | ౧౫౩౪౬౬౬. |
| క్రైస్తవులు | ... | ౧౫౧౩౮౨. |
| జైనులు | ... | ౨౧౫౪౩. |
| సిక్కులు | ... | ౫౧౭౮. |
| పార్సీలు | .. | ౧౭౮౪. |
| యూదులు | ... | ౨౭. |
| ఆటవికులు | ... | ౫౪౪౭౮౯. |

మరియు

| | | |
|---|---|---|
| ఆంధ్రులు | ... | ౬౯౭౨౫౩౪. |
| మహారాష్ట్రులు | ... | ౩౭౮౬౮౩౮. |
| కర్ణాటకులు | ... | ౧౬౨౦౦౯౪. |
| ఉర్దూ హిందీ మాట్లాడువారు | ... | ౧౫౧౦౭౭౨. |
| అరవలు | ... | ౨౯౦౫౦. |
| గుజరాతులు | ... | ౩౩౯౧౫. |
| అరబ్బులు | ... | ౩౧౭౨. |
| ఇంగ్లీషువారు | ... | ౧౩౮౧౯. |

చదువువచ్చినవారు మొత్తములో నూటికి ౫

అ ం దు

| | | | | |
|---|---|---|---|---|
| ముసల్మానులు | నూటికి-౧౨. ౪ | సవర్ణహిందువులు | | ౪. ౮ |
| క్రైస్తవులు | ,, ౧౭. ౧ | ఆది | ,, | . ౭ |
| పార్శీలు | ,, ౯౪. | ఆర్య | | ౧. ౨ |
| బౌద్ధులు | ,, ౫౭. ౮ | బ్రహ్మోలు | | ౭౩. ౧ |
| | | జైనులు | | ౩౦. ౨ |

ఈ రాష్ట్రములో మొత్తము ౨౧౮౩౦ గ్రామములును పట్టణములును కలవు.

అ ం దు లో

| | | | | |
|---|---|---|---|---|
| ౫౦౦ జనసంఖ్యకన్న తకువ | | | గ్రామములు | ౧౨౬౦౧ |
| ౫౦౦ నుండి ౧౦౦౦ వరకు సంఖ్యగల | | | ,, | ౫౪౩౯ |
| ౧౦౦౦ ,, | ౨౦౦౦ ,, | ,, | ,, | ౨౮౦౮ |
| ౨౦౦౦ ,, | ౫౦౦౦ ,, | ,, | ,, | ౮౮౪ |
| ౫౦౦౦ ,, | ౧౦,౦౦౦ ,, | ,, | పట్టణములు | ౬౪ |
| ౧౦,౦౦౦ ,, | ౨౦,౦౦౦ ,, | ,, | ,, | ౨౬ |
| ౨౦,౦౦౦ ,, | ౫౦,౦౦౦ ,, | ,, | ,, | ౬ |
| ౫౦,౦౦౦ ,, | ౧ లక్ష ,, | ,, | ,, | ౧ |
| ౧ లక్షకు పైగా | ,, | ,, | ,, | ౧ |

హైద్రాబాదు నగరము లోని జనసంఖ్య ౪౬౬౮౯౪.

రాష్ట్రములోని ముఖ్యమగుపంటలు—౧౩౪౨ ఫసలీలో

| పంట. | సిస్తు చేసినభూమి. | | పంట. | |
|---|---|---|---|---|
| ప్రత్తి— | ౩౬౦౧౬౪౫ | ఎకరములు | ౫౩౩౮౯౧ | బేళ్లు |
| గోధుమలు. | ౧౩౦౦౬౯౯ | ,, | ౧౬ ౮౩౨౮ | టన్నులు |
| వరి | ౯౯౭౨౫౨ | ,, | ౨౯ ౨౫౫౦ | ,, |
| జొన్న | ౯౩౫౬౨౦౧ | ,, | ౧౨౭౫౩౬ ౩ | ,, |
| పొగాకు | ౭౬౨౪౯ | ,, | ౧౭౬౯౪ | ,, |
| నువ్వులు | ౬౦౦౬౪౦ | ,, | ౩౫౧౭౬ | ,, |

| | | | | |
|---|---|---|---|---|
| అవిసెలు | ౨౬౯.౨౭౨ | ,, | ౧౮౨౧౧ | ,, |
| ఆముదాలు | ౮౩౭౮౮ ౨ | ,, | ౬౦౭౯ ౬ | ,, |
| వేరుసెనగ | ౧౧౧౮౦౮౯ | ,, | ౩౧౯ ౯ ౪౦ | ,, |
| నూనెగింజలు | ౫౫౪౬౩౦ | ,, | ౧౫౩౧౫ | ,, |
| బెల్లం చెరుకు | ౪౦ ౨౧౨ | ,, | ౭౫౭౭౪ | ,, |

ఒక టన్ను అనగా [౧౧౨౦ పక్కా సేర్లు]
సేరు౧కి ౮౦ తులాలు.

## రాష్ట్రాదాయము.

మొత్తము రాష్ట్రాదాయము [౧౩౪౨ ఫ.లో] ౮౦౬ లక్షల ౧౮ వేలు.

దాని వివరము.

భూమిపన్ను (మాల్గుజారీ) వలన ౩౦౫ లక్షల ౪౩ వేలు

| | | |
|---|---|---|
| అడవులు | ... | ౧ లక్ష ౮౫ వేలు. |
| | | ౧౧ ,, ౮౧ ,, |
| కరోడిగిరి | ... | ౧౦౨ ,, ౫౪ ,, |
| ఆబ్కారీ | ... | ౧౫౮ ,, ౪౪ ,, |
| నల్లమందు గంజాయి | ... | ౧౪ ,, ౨౬ ,, |
| స్టాంపులు | ... | ౧౯ ,, ౯౧ ,, |
| రిజిస్ట్రేషను | ... | ౨ ,, ౯౫ ,, |
| గనులు | ... | ౨ ,, ౮౨ ,, |
| బీరారుల్లకై దొరుకు ప్రతిఫలము | | ౨౯ ,, ౧౭ ,, |
| వడ్డీ | ... | ౭౩ ,, ౫౮ ,, |
| టంకసాల | ... | ౫౪ ,, |
| నోట్లు [కాగితములు] | ... | ౨౦ ,, ౯౬ ,, |
| సిక్కా బటావక్ | ... | ౧౨ ,, |
| టపా | ... | ౧౧ ,, ౨౭ ,, |
| అబ్కాషీ | ... | ౪౧ ,, |
| రైల్వేలు | ... | ౩౮ ,, ౧౮ ,, |

( రూపాయిలన్నియు హాలీలు )

| | | |
|---|---|---|
| ఎలెక్ట్రిసిటీ | ... | ౧ ,, ౩౫ ,, |
| ఇతరములు | ... | ౮ ,, ౮౧ ,, |

ప్రభుత్వమునకు ఖర్చు ప్రతి సంవత్సరము (౧౩౪౯ ఫ॥ లో) ౫౮౪ లక్షల ౨౭ వేలు-

ముఖ్యమైన ఖర్చు వివరము.

| | |
|---|---|
| మాల్గుజారీపైన | ౬౫ లక్షల ౨౦ వేలు. |
| ఆబ్పాషి (irrigation) | ౨ ,, ౫ ,, |
| అడవులు | ౭ ,, ౪౬ ,, |
| కరోడిగిరి | ౯౯ ,, ౯౫ ,, |
| ఆబ్కారీ | ౩౯ ,, ౧౫ ,, |
| నల్లమందు, గాంజా | ౧ ,, ౧౪ ,, |
| స్టాంపులు | ౧ ,, ౧౧ ,, |
| రిజిస్ట్రేషన్ | ౧ ,, ౬౩ ,, |
| గనులు | ౫౫ ,, |
| వడ్డి | ౩౪ ,, ౬౫ ,, |
| అప్పులు | ౬ ,, |
| టంకసాల | ౧ ,, ౬౩ ,, |
| మ. ఘ. వ. ప్రభువుగారికి చెల్లింపులు | ౮౪ ,, ౩ ,, |
| యువరాజుల ఖర్చులు | ౨ ,, ౫౪ ,, |
| జనరల్ పరిపాలన | ౪౧ ,, ౧౪ ,, |
| మన్సబులు | ౧౮ ,, ౪౬ ,, |
| మిలిటరీ (సైన్యము) | ౫౫ ,, ౮౫ ,, |
| న్యాయస్థానము | ౯౯ ,, ౮౨ ,, |
| జెల్లు | ౪ ,, ౭౮ ,, |
| పోలీసు | ౬౨ ,, ౪౪ ,, |
| విద్య | ౭౫ ,, ౯౦ ,, |

| | |
|---|---|
| మందులు (వైద్యశాఖ) | ౨౯ ,, ౩౬ ,, |
| మతశాఖ | ౧౨ ,, ౧౯ ,, |
| వ్యవసాయశాఖ | ౮ ,, ౫౫ ,, |
| పశువైద్యము | ౪ ,, ౭౨ ,, |
| సహకారము | ౩ ,, ౮౯ ,, |
| మునిసిపాలిటీలు | ౫౧ ,, ౮౨ ,, |
| బంగ్లాలు, రోడ్లు | ౬౯ ,, ౪౨ ,, |
| రైల్వేలు | ౧ ,, ౫౫ ,, |
| పరిశ్రమలు | ౩ ,, ౧౧ ,, |

## అధికారుల జీతములు.

మన రాష్ట్రములోని గొప్ప అధికారుల నెల జీతము ఈ ప్రకారముగా నున్నవి- జీతములు సాధారణముగా హాలీలు. హాలీలు కానిచోట కల్దారు అని సూచింపబడినది.

| అధికారము- | నెలజీతము. రూ- | అలవెన్సు. | వివరము. |
|---|---|---|---|
| పేష్కారు. | ౬౦౦౦ | | |
| సదరె ఆజం | ౭౦౦౦ | ౧౦౦౦ | |
| సదరుల్మహాం సైన్యము | ౩౫౦౦ | | |
| సదరుల్మహాం ఫైనాన్సు | ౪౨౫౦ | ౧౦౦ | కల్దారు. |
| సదరుల్మహాం మాల్గుజారీ | ౪౦౦౦ | ౧౦౦ మోటారు | ,, |
| | | ౧౫౦ బంగ్లా | ,, |
| సదురుల్మహాం తామీరాత్ | ౩౫౦౦ | | |
| సదరుల్మహాం అదాలత్ వగైరా | ౩౫౦౦ | | |
| సదరుల్మహాం సియాసియాత్ | ౩౫౦౦ | | ౫౦౦ |
| సదరుల్మహాం పేషీ | ౨౦౦౦ ఖాల్సా | | ౧౦౦ |
| | ౧౫౦౦ హుజూర్ | | |
| | ౫౦౦ సర్ఫేఖాస్ | | |
| మోతెమద్ బాబెహుకూమత్ | ౧౨౦౦ | | ౩౦౦ |

| | | |
|---|---|---|
| మోతేమద్ సియాసి | ౧౫౦౦ | |
| నాయబ్ మోతెమద్ సియాసి | ౧౨౦౦ | |
| పైనాన్సు మోతేమద్ | ౧౫౦౦ | ౫౦౦ |
| మోతెమద్ మాల్గుజారి | ౩౨౫౦ | ౨౫౦ కల్దారు |
| నాజిం అత్యాత్ | ౧౨౫౦ | |
| షరీకు మోతెమద్ మాల్గుజారి | ౧౨౦౦ | ౩౦౦ |
| నాయబ్ మోతెమద్ మాల్గుజారి | ౧౦౦౦ | ౧౦౦ |
| నాయబ్ పైనాన్సు మోతేమద్ | ౧౨౦౦ | ౧౦౦ |
| మోతెమద్ అదాలత్ | ౨౦౦౦ | ౩౦౦ |
| నాయబ్ మోతెమద్ | ౧౨౦౦ | |
| మోతెమద్ తామీరాత్ | ౨౫౦౦ | ౮౫౦ |
| నాయబ్ ఛీఫ్ ఇంజనీయర్ | ౧౫౦౦ | ౩౦౦ |
| నాయబ్ మోతెమద్ | ౧౨౦౦ | |
| మోతెమద్ డ్రయినేజ్ | ౧౮౦౦ | ౩౫౦ |
| మోతెమద్ తిజారత్ | ౧౨౦౦ | ౬౦౦ |
| ముషీరె ఖానూన్ | ౨౦౦౦ | ౩౦౦ |
| మతశాఖ మోతెమద్ | ౧౫౦౦ | |
| సదర్ మహాసబ్ | ౧౫౦౦ | ౩౦౦ |
| టంకసాల నాజం | ౨౦౦౦ | ౬౦౦ ,, |
| సూబేదార్లు | ౧౫౦౦ | ౧౦౦ |
| అవ్వల్ తాలూక్దార్లు | ౧౨౦౦ | |
| దువ్వం తాలూక్దార్లు | ౬౦౦ | |
| తహిశీల్దార్లు | ౩౦౦ | సాధారణముగా ౩౦౦ నుండి ౩౫౦ వరకు |

మోతెమద్ అనగా కార్యదర్శి, షరీకు అనగా సంయుక్త, నాయబ్ అనగా అసిస్టెంటు (సహాయ), తిజారత్ అనగా వ్యాపారము.

## రాష్ట్ర విభజనము-

నిజాంరాష్ట్రము రెండుపెద్దభాగములుగ విభజింపబడినది-
(౧) తెలంగానా, (౨) మరాట్వాడా.

కర్ణాటకులు ౧౫ లక్షలకు పైగా నుండినను వారిని మరాట్వాడాలోనే చేర్చినారు- ఈ రెండును మరల (౪) సూబాలుగా విభజింపబడినవి. మనరాష్ట్రములో మొత్తము ౧౬ జిల్లాలు. ప్రతి జిల్లాలో కొన్ని తాలూకాలు కలవు.

౧ ఔరంగాబాదు సూబా
౨ గుల్బర్గాసూబా
౩ మెదకు సూబా
౪ వరంగల్ సూబా

౧. ఔరంగాబాదు సూబాలోని జిల్లాలు.—

౧ ఔరంగాబాదు
౨ బీడ్
౩ పర్భనీ
౪ నాందేడ్

౨. గుల్బర్గా సూబాలోని జిల్లాలు.

౧ గుల్బర్గా
౨ ఉస్మానాబాదు
౩ బిదరు
౪ రాయచూరు.

౩. మెదకు సూబాలోని జిల్లాలు.

౧ మెదకు
౨ నల్లగొండ
౩ బాగత్
౪ మహిబూబునగరు.

౪. వరంగల్ సూబాలోని జిల్లాలు-

౧ వరంగల్
౨ కరీంనగర్
౩ ఆదిలాబాదు
౪ నిజామాబాదు.

ఈ సూబాలలో చేరనట్టి అత్రాపుబల్దాజిల్లా యొకటిగలదు.

మరియు ప్రతి జిల్లాలోని తాలూకాలీ క్రింది విధముగా నున్నవి.

# ఔరంగాబాదు సూబా.

| ఔరంగాబాదు జిల్లా తాలూకాలు. | | బీడ్ జిల్లా తాలూకాలు | | పర్భనీజిల్లా తాలూకాలు | | నాందేడుజిల్లా తాలూకాలు | |
|---|---|---|---|---|---|---|---|
| ౧ | అంబడ్ | ౧ | మోమినాబాద్ | ౧ | హింగోలీ | ౧ | బిలోలీ |
| ౨ | ఔరంగాబాదు | ౨ | ఆష్టీ | | | ౨ | దేగ్లూర్ |
| ౩ | భోకర్దన్ | ౩ | బీడ్ | ౨ | కలమ్నూరీ | ౩ | హదగావ్ |
| ౪ | గంగాపూర్ | ౪ | గెవ్రాయీ | ౩ | పర్భనీ | ౪ | కంధార్ |
| ౫ | జాల్నా | ౫ | మంజ్లేగావ్ | ౪ | పాథ్రీ | ౫ | ముధోల్ |
| ౬ | కన్నడ్ | ౬ | పాటోదా (సర్ఫెఖాసు) | ౫ | బస్మత్ | ౬ | నాందేడ్ |
| ౭ | పఠన్ | | | ౬ | జేతూర్ | | |
| ౮ | విజాపూర్ (సర్ఫెఖాస్ ఇలాకా) | | | ౭ | పాలెం (సర్ఫెఖాసు) | | |
| ౯ | ఖుల్దాబాదు | | | | | | |
| ౧౦ | సిల్లోడ్ | | | | | | |

## గుల్బర్గా సూబా.

| గుల్బర్గాజిల్లా తాలూకాలు | రాయచూరు జిల్లా తాలూకాలు | ఉస్మానాబాదుజిల్లా తాలూకాలు | బీదర్ జిల్లా తాలూకాలు |
|---|---|---|---|
| ౧ చించోలి | ౧ ఆలంపూరు | ౧ తుల్జాపూర్ | ౧ బీదరు |
| ౨ గుల్బర్గా | ౨ దేవదుర్ | ౨ కలం (సర్ఫెఖాస్) | ౨ అహ్మద్‌పూర్ |
| ౩ కొడంగల్ | ౩ గంగావతి | ౩ ఉస్మానాబాదు( ,, ) | ౩ ఉద్గీర్ |
| ౪ సేడమ్ | ౪ కుష్టుగి | ౪ పరేండా (సర్ఫెఖాస్) | ౪ నెలంగా |
| ౫ యాద్గీర్ | ౫ లింగసూగూరు | ౫ లాతూర్ ( ,, ) | ౫ జన్వాడా (సర్ఫెఖాస్.) |
| ౬ అందోలా (సర్ఫెఖాస్) | ౬ మాన్వి | | |
| ౭ షోరాపూర్( ,, ) | ౭ రాయచూరు | | |
| ౮ షాపూర్ ( ,, ) | ౮ సింధునూరు | | |

# మెదకు సూబా.

| మెదకుజిల్లా తాలూకాలు | బాగాత్ జిల్లా తాల్లూకా | మహిబూబునగర్ జిల్లా తాలూకాలు | నల్లగొండజిల్లా తాలూకాలు |
|---|---|---|---|
| ౧ అందోలు, | ౧ బాగాతు | ౧ అమ్రాబాదు | ౧ భువనగిరి |
| ౨ కలబ్గూర్ | | ౨ కల్వకు_ర్తి | ౨ దేవరకొండ |
| ౩ మెదకు | | ౩ మహిబూబునగరు | ౩ హుజూరునగరు |
| ౪ సిద్దీపేట | | ౪ మ_క్తల | ౪ జన్గామ |
| ౫ యల్లారెడ్డి | | ౫ నాగరకర్నూలు | ౫ మిరియాలగూడెము |
| | | ౬ పర్గి | ౬ సూర్యాపేట |
| | | | ౭ నల్లగొండ |

## వరంగలు సూబా.

| వరంగలుజిల్లా తాలూకాలు. | కరీంనగరుజిల్లా తాలూకాలు. | ఆదిలాబాదుజిల్లా తాలూకాలు | నిజామాబాదు జిల్లా (ఇందూరు) తాలూకాలు |
|---|---|---|---|
| ౧ ఖమ్మం | ౧ జగ్త్యాల | ౧. ఆదిలాబాదు | ౧. ఆర్మూరు, |
| ౨ మహిబూబాబాదు | ౨ హుజూరాబాదు | ౨. ఆసిఫాబాదు | ౨. బోధన్, |
| ౩ మధిర | ౩ కరీంనగరు | ౩ చెన్నూరు | ౩. బాన్స్వాడా, |
| ౪ పాకాల | ౪ మహాదేవపూరు | ౪ కిన్వట్ | ౪. కామారెడ్డి, |
| ౫ పాల్వంచ | ౫ పరకాల | ౫ లక్సెట్టిపేట | ౫. నిజామాబాదు. |
| ౬ ములుగు | ౬ సిరిసిల్లా | ౬. నిర్మల | |
| ౭ వరంగల్ | ౭ సుల్తానాబాదు | ౭ రాజూరా | |
| ౮ యల్లందు | | ౮ సిర్పూరు | |
| | | ౯ బోధ్ | |
| | | ౧౦ ఊట్నూరు | |

అత్రాఫుబల్దా జిల్లా తాలూకాలు ౧. అంబర్పేట (షర్కీ), ౨- ఆసఫ్‌నగర్ (గర్బీ) ౩. మేడ్చల్ (షిమాలీ) ౪. షాహాబాదు (జునూబీ) ౫. పట్లూరు (ధారూరు). ౬. ఖడ్కా ౭. హుమ్నాబాదు.

# శాసనసభ

ఇక నిజాంరాష్ట్రరాజ్యాంగపద్ధతి యెట్లున్నదో విచారింతము. క్రొత్తచట్టములు చేయించుటకు, ఉన్నవానిలో మార్పులు చేయుటకు, ఫర్మానులిచ్చుటకును, ఇతర విధములలో సర్వకార్యములందును తమ యిష్టానుసారము ఆజ్ఞలను జారీచేయుటకును మ. ఘ. వ. నిజాము ప్రభువుగారు సర్వతంత్రస్వతంత్రులు. రాష్ట్రములో శాసనాదులను చేయుటకు శాసనసభయు, వివిధ ప్రభుత్వశాఖలను పరిపాలించుటకును, ముఖ్యరాజకీయసమస్యలను పరిష్కరించుటకు బాబెహుకూమతును (కార్యనిర్వాహకసభ)కలవు. ఈ రెండు సభలలో కావింపబడు తీర్మానములు ప్రభువుగారి యంగీకారము పొందనిది చెల్లనేరవు. బాబెహుకూమతు ఆరుశాఖలుగా విభజింపబడినది. ఆవివరములిప్పుడు వివరింతుము. సర్వరాజ్యాంగములకును మూలము మన ప్రభువుగారేయని తెలిసికొనవలయు.

ప్రభువుగారు



శాసనసభలు (శాసనములుకావించుట)

బాబెహుకూమత్ (ఆరుశాఖలద్వారా వివిధసర్కారీ శాఖలను చూచుకొనుట.

బ్రిటిషిండియాలో ప్రతిరాజధానికిని ఒక శాసనసభయు మొత్తము ఇండియాకు ఒక అసెంబ్లీస్టేటుకౌన్సిలులున్ను కలవు. అచ్చటి శాసనసభలకును మనశాసనసభకును చాల భేదములుకలవు. మన రాష్ట్రమునకంతయు నొకే శాసనసభ కలదు. ఈశాసనసభ ఖానూన్ ౧ సన్ ౧౩౦౪ ఫసలీమూలముగా నేర్పాటు చేయబడెను. ఈ సభానియమావళిలో కొన్నిమార్పులు ఖానూన్ 3 సన్ ౧౩౦౯ ఫ. మరియుఖానూన్ ౧ సన్ ౧౩౧౫ ఫ. ద్వారా గావింపబడినవి. శా

వున ఈ౨౦ ఏండ్లనుండి మనశాసనసభలో కనబడునంతటి మార్పు లేనియు చేయబడలేదు.

మనశాసనసభలో మొత్తము ౨౨ మంది సభ్యులు:

సభ్యుల వివరము

| | | |
|---|---|---|
| అధ్యక్షులు | | ౧ |
| ఉపాధ్యక్షులు | | ౧ |
| ప్రభుత్వ సభ్యులు | | ౧౨ |
| అనధికారసభ్యులలో జాగీర్దారులపక్షమున | ౨ | ౬ |
| ,, ,, వకీళ్లపక్షమున | ౨ | |
| ,, ,, పాయగాసంస్థానములపక్షమునుండిపంపబడినసభ్యుడు | ౧ | |
| మంత్రిగారు నియమించిన సభ్యుడు | ౧ | |
| అనధికార సభ్యులు తమముద్దతు పూర్తి అగుటచే వెళ్లిపోవునప్పుడు వారిలోనుండి మంత్రిచే నియమింపబడినవారు. | | ౨ |
| మొత్తము | | ౨౨ |

పై మెంబర్ల వివరములింకను నిట్లున్నవి:—

అధికార సభ్యులలో

౧. మీర్ మజ్లిస్ (ప్రధాన న్యాయమూర్తి)
౨. న్యాయశాఖ కార్యదర్శి
3. ముఫ్తీశేఖానూర్ (Legal adviser)

వీరు ఉండితీరవలెను.

అనధికార సభ్యులలో

జాగీర్దారులలో ౬౦౦౦ రూపాయీలులేక అంతకుపైగా సాలీనా ఆదాయముగలవారే తమలో ఇద్దరిసభ్యుల నెన్నుకొని పంపవలెను.

వకీళ్లలో హైకోర్టువకీళ్లే తమలో ఇద్దరిని ఎన్నుకొని పంప వలెను.

కనుక మొత్తముపై విచారించిచూచిన నిజముగా అనధికారులును స్వతంత్రులును అనదగిన మెంబర్లు ఇద్దరే [ఇద్దరువకీళ్ళు]

సభ్యుల ఎన్నికలు రెండేండ్లకొకమారు జరుగును, మున్షీరెఖానూర్ గారు శాసనసభా కార్యదర్శి. సభలెప్పుడు జరుగునది ఎన్నడుజరుగునది ఎన్నిమార్లు జరుగునది అంతయు మంత్రిగారి యిష్టము. సభకు ౫ మెంబర్లకన్న తక్కువ మెంబర్లువచ్చిన సభాకార్యములు జరుపకూడదు. ఒకవేళ ౫ కన్న హెచ్చువచ్చినను అధ్యక్షుల యిష్టములేకున్న సభను ఆపివేయవచ్చును.

స భ లో ని చ ర్చ లు

దరఖాస్తులు:—

అనగా ఏశాసనము గావింపబడనున్నదో దానిసంబధమగు దరఖాస్తులను ప్రవేశపెట్టి సభ్యులు ఆలోచించుట.

సభ్యుల ప్రస్తావములు

(Motions) ఇవియు కొబోవు శాసనసంబంధమైనవిగా నుండ వలెను.

ఇ ప్పు డు ం డు మెం బ ర్లు

(౧౩౪౪ ఫ.లో)

౧. అధ్యక్షుడు
౧. ఉపాధ్యక్షుడు
౧. మీర్ మజ్లిస్
౧. హోం సెక్రటరీ
౧. కార్యదర్శి-మున్షీ రెఖానూర్

} హోదానుబట్టి సభ్యులు

| | | |
|---|---|---|
| ౧. | మతశాఖ నాజిం | అధికార సభ్యులు |
| ౧. | (ఫైనాన్సు) ఆర్థికశాఖ కార్యదర్శి | |
| ౧. | అత్యాత్ నాజిం | |
| ౧. | రాజకీయశాఖా (సెక్రెటరీ) కార్యదర్శి | |
| ౨. | హైకోర్టు న్యాయమూర్తులు | |
| ౧. | కోత్వాలు | |
| ౧. | సర్ఫెఖాస్ స్పెషల్ ఆఫీసరు | |
| ౧. | పారిశ్రామికశాఖకార్యదర్శి | |
| ౧. | మీర్ మజ్లిస్ పాయగా | అధికారేతర సభ్యులు |
| ౨. | హైకోర్టువకీళ్లు | |
| ౨. | జాగీర్దార్లు | |
| ౧. | సాహుకారి | |
| ౨. | అసాధారణ సభ్యులు. | అసాధారణ సభ్యులు |
| ౨౨. | మొత్తము | |

చిత్తుశాసనములు

సభ్యులచే చిత్తుశాసనములు (Bills) ప్రవేశపెట్టబడిన అధిక సంఖ్యాకులామోదించినచో ఆశాసనమును ప్రభువుగారి ఫర్మానసు కొరకై పంపుదురు.

శాసనసభయొక్క ముఖ్యకార్యము శాసనములలో మార్పులు లేక రద్దు, లేక క్రొత్తవిచేయుటయైయున్నది. వోట్లు [సమ్మతులు] ఇచ్చుటలో ఒకవేళ అధ్యక్షుని వోటుతోకూడ ఉభయపక్షములలో సమానపువోట్లు ఏర్పడిన అధ్యక్షులు మరల తనవోటును వినియోగించి (Casting Vote) శాసనమును పడగొట్టవచ్చును. లేక నెగ్గింపవచ్చును.

కాబోవు శాసనమువలన ఎవరికేని ఎవరిద్రవ్యమునకేని నష్టముకలుగునట్లైన వారుగాని వారివకీళ్ళుగాని అధ్యక్షుని సెలవుబొంది సభలో తమ ఆక్షేపణము వినయపూర్వకముగా ఉచితపద్ధతిని తెలుపుకొనవచ్చును. అధ్యక్షుల సెలవులేనిది ఏసభ్యుడుగాని యీ క్రింది విషయములతో సంబంధముగల శాసనముల ప్రవేశపెట్టగూడదు.

౧. సర్కారీ ఆదాయములు, ఖజానా, బాకీవగైరా
౨. ప్రజలయొక్క మత విశ్వాసములు
౩. సైన్యశాఖ
౪. నిజాంరాష్ట్రమునకు బ్రిటిషు ప్రభుత్వమునకునుగల సంబంధములు
౫. శాసనసభా నియమావళి
౬. ప్రభువుగారి ఫర్మానులకు విరుద్ధము లగునవి

అయినను ఈ క్రిందివాటితో సంబంధించిన శాసనములనే ప్రవేశపెట్టవలెను.

౧. షరెషరీఫ్(ఇస్లాముమత శాసనము)
౨. హిందూ ధర్మశాస్త్రములు.
౩. ఆయాసంఘములయొక్క ప్రత్యేక శాసనములు
౪. ఆచారములు

ప్రవేశపెట్టబడు చిత్తుశాసనము వారముదినములుముందు ప్రతి సభ్యునికి పంపబడును. ఒకవేళ మార్పులుగాని అధికాలోచనగాని అవసరముండిన నొక ప్రత్యేకసంఘము నేర్పాటుచేసి వారివశము చేయుదురు. వారి యభిప్రాయానంతరము మరల చర్చించి అధికసంఖ్య యెట్లుతీర్మానించిన అట్లు నిర్ణయింతురు.

ఈసభా తీర్మానము ప్రభువుగారి అనుజ్ఞకై పంపబడును. ప్రభువుగారి యాజ్ఞాప్రకారమే శాసనసభవారు రద్దుచేయుటయో లేక సూచించినప్రకారము మార్పులు చేయుటయో కావించి విజ్ఞాపనము పంపుకొందురు. ఇవి మన శాసనసభా విశేషములు.

**గమనిక:—**

౧౩౨౧ ఫసలిలో శాసనసభయొక్క భవనప్రవేశోత్సవసందర్భమున ప్రభువుగారికి శాసనసభవారు అధికారసభ్యులును, అనధికారసభ్యులును సమానసంఖ్యలో నుండవలెనని వినతిపత్రము సమర్పించుకొనిరి. అందుపై ఆ రేండ్లకాలమువరకు యిదివరలోనుండిన ౬ మంది అనధికారసభ్యులుకాక మరి ౫ గురు హెచ్చుగా తీసుకొనునట్లు సెలవిచ్చిరి. కాని అది నేటివరకును అమలులో లేకపోయెను.



# బాబెహుకూమత్

దీనిని ఇంగ్లీషులో ఎక్జిక్యూటివ్ కౌన్సిలు అందురు. తెనుగులో కార్యనిర్వాహకసభ. ఈ బాబెహుకూమతునకుపూర్వము కౌన్సిల్ ఆఫ్ స్టేటుఅనునదుండెను తర్వాత క్యాబినెటుకౌన్సిలు ఏర్పడెను. ౧౮౯౩ క్రీ. శ లో కావింపబడిన "ఖానూన్చెముబారక్" అను శాసనముప్రకారమివి జరుపబడుచుండెను. ఇప్పటి ప్రభువుగారికాలములో కూడ ప్రధానమంత్రిద్వారా ఈ క్యాబినెట్ కౌన్సిలు వ్యవహారములు జరుగుచుండెను, కాని ప్రభువుగారే ౫ ఏండ్లవరకు మంత్రిగారిపనిగూడ చేసిరి. ఇట్లు రాజ్యపాలనచేయుట భారమనిభావించి ౧౬ దై ౧౩౨౯ ఫసలినాడు బాబెహుకూమతును ఏర్పాటుచేసిరి. ఈబాబెహుకూమతుకు అధ్యక్షులు సదరెఆజం. వీరు ప్రధానమంత్రులు. దీనిసభ్యులు ఎనిమిదిగురు. అందుఆర్గురు ఆయాశాఖలపక్షముననుందురు. వీరిని సదరుల్మహాములందురు.

ఈ బాబెహుకూమత్ సభ ప్రతివారమొకమారు జరుగును. సదరెఆజం ఉండిన వారధ్యక్షులుగానుందురు. వారు లేకుండిన సభ్యులలోనే ఒకరు (సహాయ సదరెఆజంగా ప్రభువుగారిచే నేర్పాటు ఐనవారు) అధ్యక్షులగుదురు అధికసంఖ్యాకుల తీర్మానము నెగ్గును. అది ప్రభువుగారిఅనుజ్ఞకై పంపవలెను. వారు అనుజ్ఞయిచ్చిన చెల్లును. లేదా వారికి రద్దుచేయు (Veto) అధికారముకలదు.

బాబెహుకూమతుకు అనేకాధికారములుకలవు. ఉన్నతోద్యోగుల నియామకములు, వారి నేరముల విచారణ, భూమిపన్నుల హెచ్చింపు తగ్గింపు, మురాఫాలు (Appeals) వినుట. గష్తీలుచేయుట, లేక రద్దుచేయుట, మున్నగునవి కలవు. ప్రభువుగారు తమ ఫర్మానులో దానివిధులనుగూర్చి యీప్రకారము సెలవిచ్చినారు.

“విద్యాభివృద్ధి, ఆరోగ్యవృద్ధి, అర్థకాభివృద్ధి, వ్యాపారము చేతిపనులప్రోత్సాహము, బాటలు రైళ్ళు మున్నగు రాకపోకల అభివృద్ధి, ఇంకను ఇట్టివి”, ఈబాబెహుకూమతు అధీనమైయున్నవి.

సదరుల్మహాములలో (మెంబర్లు) ప్రతివారికిని కొన్ని శాఖలేర్పాటుచేసినారు. ఇట్లు ఆర్గురి సదరుల్మహాముల అధీనములో రాష్ట్రములోని సర్కారీ శాఖలన్నియు చేరియున్నవి. ఈఆరుగురి అధికారములు, వారిఅధీనమందుండు శాఖల్రక్రిందనియ్యబడుచున్నవి.

---

## సదరుల్మహాం మాల్ (రెవిన్యూ మెంబర్)

మాల్గుజారిశాఖలో నీక్రిందివి చేరియున్నవి:—

| కచ్చేరీలు. | అధికారులు. |
|---|---|
| ౧. మాల్గుజారీ కచ్చేరీ | సూబేదారులు |
| ౨. కరోడ్గిరి (Customs) | కరోడ్గిరి నాజిం |
| ౩. ఆబ్కారీ | ఆబ్కారీ ,, |
| ౪. బందోబస్తు (Settlement) | బందోబస్తు ,, |
| ౫. జంగ్లాత్ (Forest) | ,, |
| ౬. పరిగణనశాఖ (Statistics) | ,, |
| ౭. అతియాత్ [ఇనాములసంబంధము] | ,, |
| ౮. తరక్షీయాం తెలమ్మా [అభివృద్ధిశాఖ] | ,, |
| ౯. కోత్వాలీబల్దా (Commissioner of city police) | కోత్వాలు |
| ౧౦. జిల్లాలకోత్వాలు Ditector of Distric t Police and jails | నాజిం పోలీసు అజ్లా |

| | |
|---|---|
| ౧౧. వ్యవసాయశాఖ | వ్యవసాయశాఖనాజిం |
| ౧౨. పరిశ్రమశాఖ (సనత్ వ హిర్ఫత్) | పరిశ్రమల ,, |

---

సదరుల్మహాం ఫైనాన్సు (Finance member)

వీరి అధీనములోని కచ్చేరీలు:—

| కచ్చేరీలు. | అధికారి పేరు. |
|---|---|
| ౧. సదరు మహాసబీ | సదరుమహాసబ్ |
| ౨. దీవానీ దఫ్తర్ | దఫ్తరెదీవాని నాజిం |
| ౩. టంకశాల [ఇందు సిక్కా-చేయుట, ఎలక్ట్రిసిటీ, నోట్లు, తూకములు, చేరినవి.] | దారుల్జరబ్ ,, |
| ౪. రైల్వే | ఛీఫ్ ఏజెంటు |

---

సదరుల్మహాం అదాలత్ వ ఉమూరెఆమ్మా

(Home Secretariat)

వీరి ఆధీనములోని కచ్చేరీలు:—

| కచ్చేరీలు. | అధికారి పేరు. |
|---|---|
| ౧. టప్పా | టప్పా నాజిం |
| ౨. హైకోర్టు (అదాలతుల్ ఆలియా) | మీర్ మజ్లిసు (Chief Justice) |
| ౩. ముద్రాలయము, స్టేషనరి. Government Prees, Stationery depot | మొహతెమీం |
| ౪. పురాతత్త్వశాఖ (ఆసారెకదీమా) | నాజిం |
| ౬. మతశాఖ | నాజిం |

## సదరుల్మహాం ఫౌజ్ వ తిబాబత్. (Military & Health member)

వీరి అధీనములోని కచ్చేరీలు:—

| కచ్చేరీలు. | అధికారి పేరు. |
|---|---|
| ౧. సైన్యశాఖ (బాఖా ఇుదా, బేఖాయిదా) (Regular and irregular troops) | కమాండర్. ఇన్ చీఫ్ |
| ౨. యూనానీశాఖ | మొహతెమీం |
| ౩. ఆంగ్లవైద్య | నాజిం |

## సదరుల్మహాం తామీరాత్

| | |
|---|---|
| ౧. తామీరాత్ ఆమ్మా<br>ఆబ్ పాషి (irrigation) | చీఫ్ ఇంజనీయరు |
| ౨. డ్రెయినేజ్, | నాజిం |
| 3. టెలిఫోను | మొహతెమీం |

## సదరుల్మహాం సియాసియాతు

| | |
|---|---|
| ౧. సియాసియాత్ (రాజకీయశాఖ) | కార్యదర్శి |
| ౨. సఫాయి (మునిసిపాలిటీ) | కమిషనర్ |
| 3. ఆరాయిష్‌బల్దా City improvement board | నాజిం |
| ౪. తాలీమాత్ (విద్యాశాఖ) | ,, |
| ౫. ప్రకటనశాఖ (Information bureau). | ,, |

# సర్కారీకచేరీల విభజన

బాబెహుకూమతులోని శాఖలనుగూర్చి తెలిపినాము. ఆ శాఖలలో [రాష్ట్రములోని సర్కారీశాఖలలోని] విశేషములు తెలిసికొనవలెను. అట్లు తెలుసుకొనుటకుముందు తాలూకాలలో జిల్లాలలో సూబాలలో ఏయే కచ్చేరీలుండునో తెలిసికొనవలెను.

మనరాష్ట్రములో నాలుగు విధములగు ప్రభుత్వములున్నవనవచ్చును.

౧. దివాని. దీనినే ఖాల్సాయందురు. ఇదినేరుగా ప్రభువుగారిచే నియోగింపబడిన అధికారులచే పాలింపబడుచున్నది.

౨. సర్ఫేఖాస్. ఇది ప్రభువుగారి సొంతఖర్చునిమిత్తమై ప్రత్యేకింపబడినభాగము. ఈపద్ధతి నవాబ్ మీర్ మహబూబలీఖాన్ ప్రభువుగారికాలములో ఏర్పాటుచేయబడినది. ఇతర దేశీయ రాజ్యములలో నీపద్ధతియున్నట్లుకనబడదు. అందుచేతనే అనేక ప్రభువులు తమ ప్రజలద్రవ్యమునుండి తమ బంగ్లాలుకట్టించుచున్నారనియు, తమ వినోదాలకు ఆడంబరములకు నుబారాఖర్చులు పెట్టుచున్నారనియు నానావిధములగు మొరలు పత్రికలలో మనమువినుచునేయున్నాము. ఇంగ్లాండులోని చక్రవర్తిగారికిని, వారి కుటుంబమువారికిని సాలీనాఖర్చులకు పార్లమెంటువారేర్పాటుచేసినారు. ఆమొత్తములో వారి సొంతఖర్చులక్రింద వారిష్టమువచ్చినట్లుఖర్చుపెట్టుకొనవచ్చును. కాని అవి ఖర్చుపెట్టి ఆదేసంవత్సరములో మరల ద్రవ్యమియ్యుమనిన ఇయ్యరు.

మనప్రభువుగారు తమ సొంతఖర్చులకై — ఒకజిల్లా (అత్రాఫుబల్దా) అనునది ప్రత్యేకించినారు. ఇదిగాక సంవత్సరమునకు ౫౦ లక్షలరూపాయలు దివానీఇలాకాఆదాయమునుండి ప్రభువుగారికియ్యబడును. మరియు కొన్ని జిల్లాలలో కొన్ని తాలూకాలనో లేక కొన్నిగ్రామములనో ఏర్పాటుచేసినారు. ఈభాగమును సర్ఫేఖాసు

అందురు. అనగా సొంతముఖర్చుఅని అర్థము. ఈ సర్ఫేఖాసులో దాదాపు దీవానీ లేక ఖాల్సా భాగములోవలెనే అధికారులుకలరు

(3) పాయెగాలు.

పూర్వము నిజాం ప్రభుత్వమునకు యుద్ధములందు సహాయము చేయుటకై కొంత సైన్యమును ఎల్లప్పుడును సిద్ధముగానుంచుటకు కొందరేర్పాటుచేయబడిరి. అట్టి ప్రతివాడును ఆ సైన్యమునకు బత్తెము, జీతము, బట్టలు, ఆయుధములు, మున్నగునవి తానే భరించుకొనవలెను. ఈ కార్యనిర్వహణమునకై వారికి కొన్ని జాగీరులిచ్చిరి. అట్టి జాగీర్లనే పాయెగాలందురు. మన రాష్ట్రములోని పాయెగాలే సంస్థానములన్నిటిలో పెద్దవి. ఆపాయెగాల వివరములు ప్రత్యేకముగా ముందు వ్రాయబడును. ఈ పాయిగాలు నవాబులకే యియ్యబడినవి. హిందువులకు ఇయ్యబడలేదు. విశేషముగా ప్రభు బంధు వర్గమువారికే యియ్యబడి యిప్పటికటులే జరుగుచు వచ్చుచున్నవి.

(౪) జాగీర్లు.

పూర్వము. ప్రభుభక్తి చూపినందున, లేక గొప్ప ఉద్యోగములు చేసినందున, లేక యుద్ధములో ప్రాణములిచ్చినందున, లేక మతవిషయములో గురువులైనందున, హిందూ రాజులును, తర్వాతి ముసల్మాను ప్రభువులును అనేకులకు జాగీరుల నిచ్చియుండిరి. అట్టి వానిలో పెద్దపెద్ద జాగీరులను సంస్థానములనియు చిన్నవాటిని జాగీరులని చెప్పుదురు.

జాగీరులవంటివే ప్రభువులచేత ఇయ్యబడిన ఇనాములలో అనేకదర్జాలు కలవు. మశ్రూలు, ఇనాములు, మున్నగువాని భేదముల నుగురించి ముందు తెలుపుదుము.

ఇచ్చట దీవానీ లేక ఖాల్సాలోని కచ్చేరీల విభజనము తెలుపుదుము.

(౧) హైదరాబాదు నగరము రాష్ట్రమున కంతయు ముఖ్య పట్టణము. ఇందు శ్రీ ప్రభువుగారుండుటచేతను, ప్రధాన మంత్రియు, ఇతర మంత్రివర్గముండుటచేతను, రెసిడెంటు, సైన్యము ఉండుటచేతను, జిల్లాలయొక్కయు సూబాలయొక్కయు మురాఫా కచ్చేరీలు నగరమందే ఉండవలసి వచ్చినది. అందుచేత నగరమందుండు ముఖ్యమగు కచ్చేరీలివనగా:—

౧. కొత్వాలీ బల్దా (City police)
౨. జిల్లా పోలీసు కచ్చేరి (District police)
౩. మాల్గుజారి (Revenue)
౪. హైకోర్టు (అదాలతుల్ ఆలియా)
౫. దివానీబల్దా ( City Civil Court )
౬. ఫౌజ్దారీబల్దా ( ,, Criminal ,, )
౭. దారుల్ ఖజా (ఖాజీగారి న్యాయస్థానము)
౮. ఉమూరె మజహబీ (మతశాఖ)
౯. వ్యవసాయపు కచ్చేరి.
౧౦. పైనాన్సు.
౧౧. టంకసాల, ఎలెక్ట్రిసిటీ, (Mint & Electricity)
౧౨. ఇంజనీయరింగు శాఖ.
౧౩. ఉస్మానియా విద్యాపీఠము (University)
౧౪. శాసనసభ.
౧౫. బాబెహుకూమత్.
౧౬. వాణిజ్య పరిశ్రమలశాఖ (Commerce and industries)
౧౭. ప్రభుత్వ ప్రకటనశాఖ (Information bureau)
౧౮. ఆరాయిషెబల్దా (City improvement board)
౧౯. సఫాయి (City Corporation)
౨౦. ఆబ్కారీ
౨౧. అడవిశాఖ
౨౨. కరోడ్గిరి

౨౩. విద్యాశాఖ
౨౪. జంతుచికిత్సాశాఖ
౨౫. వైద్యారోగ్యశాఖ
౨౬. బందోబస్తు
౨౭. తామీరాత్

## ౨ సూబాలలోని కచ్చేరీలు

| కచ్చేరీ | అధికారి |
| --- | --- |
| సూబేదారీ | సూబేదారు |
| న్యాయశాఖ | సెషనుజడ్జి లేక సదర్ అదాలతునాజిం |
| విద్యాశాఖ | సదర్ మొహతెమీం |
| టపా | మొహతెమీం |
| ఆబ్కారీ | అబ్కారీ తాలూక్దారు |

## ౩ జిల్లాలలోని కచ్చేరీలు

| కచ్చేరీ | అధికారి |
| --- | --- |
| మాల్ (Revenue) | అవ్వల్ తాలూకదారు |
| న్యాయశాఖ | నాజిం |
| విద్య | మొహతెమీం |
| నిర్మాణ [తామీరాత్] | జిల్లా ఇంజనీయర్ |
| టపా | టపాఇన్స్పెక్టర్ |
| కరోడ్గిరి [ఉండినచోట] | మొహతెమీం |
| ఆబ్కారీ | మొహతెమీం |
| వైద్యశాఖ | జిల్లా సర్జన్ |

గమనిక:—

ప్రతిజిల్లాలో వైశాల్యమునుబట్టి రెండుమూడు "డివిజనులు" ఉన్నవి. ఈ డివిజనులలో తాలూక్దారులయొక్క మదద్గారులు

(Assistant collector) ఉందురు. వీరు మాల్గుజారీపనులను విచారించుకొందురు. వీరికి కొన్ని విషయములలో తహసీలుదారు లోబడి యుండును.

౪ ప్రతి తాలూకాలోని కచ్చేరీలు

| కచ్చేరీ | అధికారి |
|---|---|
| తహసీల్ కచ్చేరీ | తహసీలుదారు |

తహసీల్దారు ఆధీనములో పేష్కారు గిర్దావరులు మొదలగువారు పనిచేయుదురు

| | |
|---|---|
| న్యాయశాఖ | మున్సిఫ్ |
| పోలీసు | ముంతెజిం లేక అమీన్ |
| నిర్మాణశాఖ | తాలూకాఆఫీసరు |
| వైద్య | అసిస్టెంటు సర్జన్ |
| రిజిస్ట్రేషన్ | రిజిస్ట్రారు |

మరియు కరోడ్గిరి ఉంచబడిన స్థలమున కరోడ్గిరీ అమీన్, అడవులున్న చోట జంగ్లాత్ అమీన్ ఉందురు.

౫ గ్రామము

అన్నిటికన్న చిన్నది గ్రామము. ఈ గ్రామాలే అందరికిని రైతు మొదలుకొని రాజువరకు జీవనాధారమైయున్నవి. ప్రతి గ్రామములో యీ క్రింది అధికారులుందురు.

౧ పోలీసుపటేలు
౨ మాలీపటేలు
౩ పట్వారీ
౪ సేత్‌సందీ (లేక తలారి)

వీరు గ్రామములోని శాంతిక సర్కారీ పన్నుకును జిమ్మేదారిగానుందురు. వీరి ఉద్యోగములు చిన్నవైనను రాజ్యములకువలె వంశపారంపర్యేణ వచ్చునవియు జ్యేష్ఠునిచే అధికారము చెల్లునట్టివి యునై యున్నవి.

ఇక ప్రతిశాఖనుగురించి ఇంచుక విపులముగా తెలుపుదుము.

# శాఖలు—వాని వివరములు

## (౧) మాల్గుజారి.

ఈ కచ్చేరీ అన్నిటికన్న ముఖ్యమైనది. రాష్ట్రపు ఆదాయములో అన్నిటికన్న హెచ్చు భూమిపన్నువలన వచ్చుఆదాయమే. అందుచేత యీశాఖ పూర్వకాలమునుండియు చాల ముఖ్యమైనది. ఈమాల్గుజారీ అధీనములోనే ఆబ్కారీ,కరోడిగిరివంటివి చాల శాఖలున్నను, ఇప్పుడు కేవలము భూమిపన్నులను గురించి మాత్రమే యీభాగములో చర్చింతుము.

ఈరాష్ట్రములోపూర్వము హిందూరాజులుండినప్పుడు సాధారణముగా పంటలో ఆరవభాగము పన్ను తీసుకొనుచుండిరి. మహారాష్ట్రుల కాలములో "చౌత్" అనగా నాల్గవభాగము వసూలు చేయుచుండిరి. దేశముఖ్, దేశపాండ్యల పద్ధతి బహుకాలమునుండి యీదేశములో నేర్పాటుగా నుండెను. ఈపద్ధతినే గోలకొండ నవాబులు జారీఉంచిరి. ప్రతి గ్రామమునకు ఒకపటేలు ఒకపట్వారి కొన్ని గ్రామాల పటేండ్లపై పెద్ద దేశముఖున్ను, అదేవిధముగ కొన్నిగ్రామాల పట్వారీల పెద్ద దేశపాండ్యా యుమరల ఈదేశముఖులపై సర్ దేశముఖున్ను దేశపాండ్యాలపై సర్ దేశపాండ్యాయున్ను ఏర్పాటు అయియుండిరి.

(కర్నాటకులు, రాష్ట్రకూటులు, రాజ్యము చేసినకాలములో ఇదేపని చేయువారిని గౌడు, నాడగౌడు, సర్నాడగౌడు అని పిలుచుచుండిరి.)

ఈ దేశముఖులు, దేశపాండ్యాలు భూమిపన్ను వసూలుచేయుటకు జిమ్మేదారులుగానుండిరి. గోలకొండ నవాబుల యనంతరము ఆసఫ్‌జాహీ వంశస్థుల కాలములో దేశమును కొన్ని భాగములుగా విభజించిరి. మొదటి నిజామగు నిజాముల్ ముల్క్ ఆసఫుజా కాలములో ఈరాష్ట్రము ౬ సూబాలుగా ౯౩ సర్కారులుగా, ౧౨౩౬ మహాలులుగా విభజింపబడెను. తర్వాతికాలములో

"సర్కారు" అను భాగములోనే పర్గణాలు ఏర్పాటు చేయబడెను. ప్రతి పర్గణాను తాలూకాదారు అనువానికో లేక గుత్తేదారునికో పదాదికి, మూడండ్లకో, పదోయొకి నియమిత కాలమునకుగాను గుత్తా కిచ్చుచుండిరి. ఆగుత్తాకన్న ఎంత ఎక్కువ వసూలైన అదంతయు గుత్తేదారుదే ఈ గుత్తేదారులైన తాలూకాదారులు మరల తమ గుత్తాలో దేశముఖులను దేశపాండ్యాలను భాగస్థులనుగా చేసి కొని వారిద్వారా పన్నులను వసూలుచేయుచుండిరి. పన్నులు భూమిపై వసూలుచేయకుండిరి. ఆ కాలములో భూమి కొలతలు లేవు. కాండ్లపైన ఎద్దులపైన పన్ను వసూలు చేయుచుండిరి.

౧౮౪౫ క్రీ. శ. లో గ్రాండ్ల్ అనునతడిట్లు వ్రాసెను:—

"పైరక లోని మూడు పర్గణాలకొకే దేశముఖుకలడు. అతనికి మొత్తము పన్నులో నూటికి ౨౪ ప్రకారముఇత్తురు. దేశపాండ్యాకు నూటికి ౭౪ ప్రకారము. సర్ దేశపాండ్యా పని దేశపాండ్యాల కాగిదాలపై దస్కతులుపెట్టి తనకీ—చేయుట. అతనికి నూటికి ౧ రూపాయిప్రకార మిత్తురు."

సాధారణముగా ౨ఎద్దుల సేద్యగానినుండి ౫ నుండి ౧౦ రూపాయీలవరకు, ౪ ఎద్దుల వానినుండి ౧౦ నుండి ౨౫వరకు ఇదే దర్జాలో వసూలు చేయుచుండిరి.

ఈపన్నేకాక ఆకాలములో నానావిధములగు పన్నులుండె డివి. అందుకొన్ని:—

౧. ధనగర్ పట్టి-(గొల్లవాండ్లపై)
౨. ధేడ్ పట్టి-(మాలమాదుగులపై)
౩. పాసీకట్టి-(పెండ్లిండ్లమీద)
౪. చర్సపట్టి-తోళ్ళమీద
౫. భోయీపట్టి—భోయీలమీద
౬. హాట్ బాజారీ—మార్కట్లమీద
౭. కలాల్ పట్టి-కల్లు దుకాణాలమీద
౮. జులాహాపట్టి—సాలెవాండ్లపై

౯. ధారాపట్టి-లోకల్ ఫండువంటిది
౧౦. రాహ్దారీ--త్రోవపట్టి
౧౧. గనీంబాబ్ -శత్రువులనుండి రక్షించినందులకు పన్ను
౧౨. పరాలపట్టి—గడ్డి సప్లైకిగాను
౧౩. బటాసబ్జీ--కూరగాయ లమ్ముకొన్నందుకు
౧౪. బాన్సఫరోషీ—బొంగులు అమ్ముకొన్నందుకు
౧౫. మజ్కూరీపట్టి—కూలీలమీద
౧౬. రెడ్డిరుసుము—రెడ్డిగారికి చెల్లించవలెను
౧౭. దఫ్తర--పీనుగుల పూడ్చినందుకు చెల్లించవలసినది
౧౮. తైలీ పాన్ పట్టి—నూనె, తమలపాకులవారిచ్చుకొనవలసినపన్ను.
౧౯. మచ్లీపట్టి—బేస్తవారిమీద
౨౦. కుంభార్ పట్టి—కుమ్మరివారిమీద
౨౧. భైంస్ పట్టి--దున్నపోతులుంచుకొన్నందుకు
౨౨. ఆదంపట్టి—హిందూ శిల్పకారులమీద
౨౩. మొహతర్ఫా—ఇంటిపన్ను (సాధారణముగా ముస్లిములపై వసూలు)
౨౪. సఫర్ పట్టి--జమీందారుగారి దౌరాకుగాను అగు ఖర్చులకై వసూలు.

ఇంకను ఇట్టివనేకములగు పన్నులుండెను. ఫస్లీడింములో ఇంచుమించు నూటికి ౯౦ పాళ్ళు తీసివేయబడినవి.

శ్రీ. శ. ౧౮౬౭ లో సర్ సాలారుజంగు మంత్రి భూమిపన్నులలో గొప్ప మార్పులుగావించెను. కొలుగుత్తా పద్ధతి తీసివేసి భూములకొలిపించి బందోబస్తుచేయించి పన్నులు ఏర్పాటుచేసెను. ఈపద్ధతివలన ఇదివరలో లాభముపొందుచుండిన గుత్తేదారులను తాలుక్దారులు కొందరు తిరుగుబాటుచేసి చాల అల్లరులుచేసిరి.

ఒకటి రెండు సందర్భములలో బ్రిటిషు సైన్య సహాయముతో తిరుగుబాటుల నణచవలసి వచ్చెను

ఇప్పుడు కొన్ని సంస్థానములలోను జాగీరులలోను తప్ప తక్కిన రాష్ట్రమందంతటను బందోబస్తు అయి భూములపై నిర్ణయమగుపన్నును తీసుకొనుచున్నారు.

మాల్గుజారీ వ్యవహారములలో సుబేదారీపైన మోతెమదీ మాల్గుజారీలో మురాఫాలు జరుగును.

## కరోడిగిరి

కరోడిగిరి- అనగా సుంకముతీసికొనుట-పూర్వమునుండి వ్యాపారస్థలవద్ద తమ రాష్ట్రములోనికి బయటినుండి తెచ్చినసరుకులపై సుంకమును రాజులు తీసుకొనుచుండిరి. బ్రిటిషిండియాలో సముద్రతీరములందుండు బొంబాయి మద్రాసు, కరాచీ, కలకత్తావంటి ఓడరేవులవద్ద విదేశములనుండివచ్చిన సరుకుపై సుంకము తీసుకొందురు. అవేసరకులు మన రాష్ట్రములోనికివచ్చిన సరిహద్దులలో వాటిపై మన ప్రభుత్వమువారు సుంకము తీసుకొందురు. మనరాష్ట్రమునకు సరిహద్దులు చుట్టునుకలవు. ఔరంగాబాదు, రాయచూరు, నల్లగొండ, కరీంనగరు, ఓరంగల్, మహబూబునగరు, జిల్లాలలోని భాగములు బ్రిటిషు సరిహద్దులతో కలియును. కావున ప్రభుత్వమువారు రాష్ట్రముచుట్టును పేటాలు, నాకాలు చౌకీలు ఏర్పాటుచేసినారు. మరియు ప్రతి రైల్వేస్టేషనువద్దను కరోడిగిరినాకాను ఏర్పాటు చేసినారు. ప్రతివస్తువుపై ఎంతకరోడిగిరి తీసికొనవలెనో ధరలుమారి కొలది అప్పుడప్పుడు నిర్ణయించుదురు. కొన్నివస్తువులపైన అనగా విశేషముగా రైతుల కుపయోగించువానిపై మాఫీలిచ్చియున్నారు.

నిజాంరాష్ట్రములోనికి వచ్చినసరకులే మరల హైదరాబాదు నగరములోనికివచ్చిన "చుంగీ" అను కరోడిగిరివసూలు చేయుచుండిరి. దానివలన సాలీనా 3 లక్షలుకూడ వసూలగుచుండెను. ఖర్చులు ఇంచుమించు అంతే అగుచుండెను. లాభములేకపోగా కరోడిగిరి

వారిచే జనులకు బాధయుండెడిది. ఈ విషయములను గమనిం చియే మన ప్రభుత్వమువారు ౫-౬ ఏండ్లక్రిందట ఈచుంగీని తీసివే సిరి.

కరోడిగిరివలన రైతులకు కొన్ని సందర్భములలో యిబ్బందులు కలుగుచుండును. వారిసరకులను తూకముచేయుటయందు, రాత్రి కాలమందునచ్చిన తెల్లవారువరకు పడియుండుటలోను కాలహరణమగుట, మూటముల్లెలు విప్పిచూచుట మున్నగునిబ్బందులుకలుగును.

## సరిహద్దు మహాసూలుఖానాలు, పేఠాలు

| మహాసూల్ఖానాలు | పేఠాలు |
|---|---|
| ఔరంగాబాదు | ౧. విజాపూరు, ౨. అజంటా, ౩. కనేర్ గావ్రూ (౩) |
| బీడ్ | ౧. పైఠణ్, ౨. మొర్మిల, ౩. ఆష్టీ (౩) |
| ఉస్మానాబాదు | ౧ నల్దుర్గ. ౨. తుల్జాపూర్, ౩. ఢోకీ, ౪. లాతూర్, (౪) |
| కొప్పల్ } లింగుసూగారు } | ౧. బస్వాపూరు ౨. ఉప్పల్ ౩. కాతర్గి ౪. హంసాసాగర్ ౫. వార్ణస్గీ (౫) |
| మధిర | ౧. వాడపల్లి, ౨. కోదాడ ౩. కల్లూరు ౪. బూర్గంపహాడు (౪) |
| రాజూరా:— | ౧. ఆదిలాబాదు, ౨. చెన్నూరు (౨) |

## రైల్వే మహాసూల్ఖానాలు

(౧) గోదావరి (జాల్నా):–ఔరంగాబాదు, పర్భనీ, నాందేడ్ నిజామాబాదు. (౪)

(౨) ఓరంగల్: ఖమ్మం భోంగీర్, పెద్దపల్లి (౩)

(౩) గుల్బర్గా:—రాయచూరు, తాండూర్, మహబూబు నగర్, బిదరు (౪)

—

౧. హైదరాబాదు

౨. సికింద్రాబాదు. మొ. ౩౨

## ఆబ్కారీ

ఈశాఖద్వారా మత్తుగలిగించు పదార్థములపై నిగరానిజరుగును. పూర్వములో సారాయి, కల్లు వగైరాలు జనులే తయారుచేసుకొని సేవించుచుండిరి. ఇప్పుడు సర్కారువారే ఈపనులంతయు తమ అధీనములోనుంచుకొని హరాజు చేయుదురు. ఈఈశాఖద్వారా, కల్లు (తాటి, ఈత) సారాయి, (దేశీ), నల్లమందు, కొకైన్, విదేశీబ్రాండీ వగైరాలు, భంగు, మున్నగునవి లైసెన్సు పొందిసర్కారుకుఅధికద్రవ్యమిచ్చువారికే అమ్ముటకు హక్కియ్యబడును. భూమిపన్ను తర్వాత సర్కారుకెచ్చుఆదాయమిచ్చునదీశాఖయే.

ఇంతకుపూర్వము గుత్తేదారులద్వారా ఆబ్కారీ ద్రవ్యము వసూలగుచుండెను ఇప్పుడు అనేకజిల్లాలలో "మద్రాసు సిస్టము" అను పేరిట నేరుగాఆబ్కారీశాఖద్వారా వ్యవహారములుజరుపబడుచున్నవి

## బందోబస్తు

పూర్వము మనదేశములో సరియైనభూమి కొలతలు లేకుండెను. మనరాష్ట్రములో సర్ సాలార్జంగు మంత్రికాలములో భూములకొలతలు, వాటితరంబందీ, పన్నులు, హద్దుల నేర్పాటుచేయుట, సంపూర్ణ ఖాయపరచుట మున్నగునవి ప్రారంభమయ్యెను. ఇవన్నియు జరిపించుశాఖనే బందోబస్తు కచ్చేరీయందురు.

## జంగలాత్ — అడవిశాఖ

మనరాష్ట్రములోని అడవుల వైశాల్యము (౧౮౨౦)చదురపుమైళ్లు. ఈఅడవులవలన ప్రభుత్వమువారికి లాభముతక్కువ. ఇండ్లుకట్టుటకు, వంటచెరుకలకు, పనికివచ్చుకట్టెను అమ్మింతురు. ౧౩౪౦ ఫసలీలో (Latest report) ఈశాఖవలన ఆదాయము రూ. (౧౩౦౬౯౪౯) వ్యయము ౮౧౧౯౫౦ రూ. అడవులలోని కట్టెలను ప్రజలు నాశనము చేయకుండునట్లుగా యీ శాఖాధికారులు తనిఖీ చేయుచుందురు.

అప్పుడప్పుడు కరువులు సంభవించినప్పుడు అడవులలో గడ్డిని రైతుల పశువులకు ఉచితముగా మేపుటకై సెలవిచ్చుచుందురు.

తక్కిన కాలములో పశువ్రకింతయని లెక్కచొప్పున తీసికొని గడ్డిమే పుటకు సెలవిచ్చుచుందురు.

## పరిగణనశాఖ (Statistics)

ఈశాఖలో రాష్ట్రములోని సర్వవిషయముల లెక్కలపట్టీలు తయారగుచుండును. ప్రతివారము రిపోర్టులను ప్రకటించుచుందురు. ధాన్యముధరలు, వర్షములు, పశుజాడ్యములు, వగైరాల పట్టీలు వేసి ప్రకటించుచుందురు. మొత్తముపై వ్యవసాయ సంబంధమగు అంకెలను ఈశాఖవారు ప్రకటించుచుందురు.

## అతియాత్ (ఇనాములు)

ఇది మాల్గుజారీలోని అంతశ్శాఖ. ఇనాములు, జాగీర్లు, సంస్థానములు, మిల్కులు, పాయెగాలు, మున్నగువాని విషయములలోని వివాదములు పరిష్కరించుట, యజమానులు చచ్చినప్పుడు, విరాసతు విషయములలోను పరిష్కారములు చేయుట, మున్నగుపనులీ శాఖ ద్వారా జరుగును. ఈశాఖలో జాగీర్దారుల విరాసతు ఇనామీ విచారణలు జరుగును. ఈశాఖలో జరుగు తీర్పులపై మురాఫా బాబె హుకూమతులో చేయబడును.

## తరక్షియాతె అమ్నా (అభివృద్ధిశాఖ)

ఈశాఖ ఇప్పుడు నామమాత్రముదే. దీనిమొదటి యుద్దేశము సిస్తుగాని భూములను రైతులకిచ్చుట యైయుండెను. అట్టివానికై సర్ అలీ ఇమాంగారి కాలములో దరఖాస్తులు పెట్టుటకై ప్రభుత్వమువారు కోరిరి. అనేకులు దరఖాస్తులుపెట్టి ౧౧ లక్షలకు పైగా ద్రవ్యమునుగూడ సర్కారులో దాఖలుచేసుకొనిరి. కాని ఏకారణము చేతనో ఆయాచలోన నిలుపుదలచేసి యెవరికైకము వారికిచ్చిరి. ౧౩౨౦ ఫసలీలో యుద్ధమునుండివచ్చిన సిపాయీలకై భూముల యినాముగా నిచ్చునేర్పాట్లు చేసిరి. ౭౨౩ సీపాయీలకు రాయచూరు జిల్లాలో సులహానగరు అను పేరుపెట్టిన స్థలములో ఇనాములు ఇచ్చిరి.

## కోత్వాలీజిల్లా (నగరరక్షకశాఖ)

ఈశాఖ చాలముఖ్యమైనది. నగరరక్షకాధికారిని కోత్వాలు అని పూర్వము మొగలాయి పాదుషాలకాలమునుండి పిలుచుచుండిరి. బ్రిటిషిండియాలో ఈఅధికారిని పోలీసు కమిషనరందురు. కోత్వాలుగారికి కొందరు మదద్గారులు (సహాయ కోత్వాలులు) ఉందురు. మరియు వారిక్రింద కొందరు సదరు అమీనులు ఈ సదరమీనుల క్రింద అమీనులుందురు. ప్రతి అమీనుక్రింద కొందరు జమేదారులు ప్రతి జమేదారుక్రింద కొందరు జవానులుందురు. మన నగరములో ౧౩౪౨ ఫసలీలో (3333) పోలీసు జవానులున్నారు.

ఈ కోత్వాలీకచ్చేరిలో (ఖుఫ్యా) (సి. ఐ. డీ.)రహస్య పరిశోధక శాఖకలదు. కొందరు స్త్రీ నౌకర్లుకూడకలరు. ఇండ్లసోదాలు చేయవలసివచ్చిన లేక స్త్రీమైదిల నిగరాని చేయవలసివచ్చిన ఈస్త్రీ నౌకరులతో పని తీసికొందురు.

కోత్వాలీశాఖలో విశేషముగా నగరములో దుర్మార్గులను నిరోధించుట, పోలీసువారిచే పట్టబడు నేరములలో విచారణము, నేరస్థులకు కోర్టులలో శిక్ష యిప్పించుట,యనునవి ముఖ్య కార్యములు. జిల్లా పోలీసువారు చేయని ప్రత్యేకమైనపని నగర పోలీసువారుచేసి ధన్యులగుచున్నారు. అదేమన రోడ్లపైపోవు మోటార్లను,బండ్లను, సైకిళ్లను, జనులను సరియైనమార్గములో పోవునట్లుచేసి జనులకు,పశువులకు ప్రాణహానికానట్లు చూచుకొనుట.

### జిల్లా పోలీసుకచ్చేరి

నగరపు పోలీసుకచ్చేరి (కోత్వాలీకచ్చేరి)వలెనే జిల్లాలన్నింటికిని సంబంధించిన ప్రత్యేకమైనకచ్చేరి నగరములోకలదు. ఈ జిల్లా పోలీసు అధికారిని డైరెక్టరు జనరల్ (సదరు నాజం) అందురు. ఇతని క్రింద కొందరు మదద్గారులుందురు. ఈమదద్గారులకు క్రింది యధికారులు జిల్లా మొహతెమీములు. ప్రతిజిల్లాకును ఒకపోలీసు మొహతెమీము (సూపరింటెండెంటు) ఉండును. ఆతనిక్రింద సర్కల్ (ఇన్స్పెక్టరులు) ఉందురు. ఆసర్కల్ అధీనములో ముంతజములుందు

రు. మరింతజంక్రింద మొహర్రర్, దఫేదారు, జవానులుందురు. ఒక రోడ్డుపై నిగరాని తప్పక్కిన విషయములలో క్ర్తాలీ పోలీసుల వలెనే ఈజిల్లా పోలీసుశాఖయు పనిచేయును. నగరపోలీసు రాత్రింబగళ్లు పట్టణములలో గస్తుకొట్టిన జిల్లా పోలీసువారలు తాలూకాలో ను జిల్లాలోను ద్వారా కొట్టుచుందురు.

ఇప్పుడు జిల్లా పోలీసుశాఖలో

౧౬౫౫ అధికారులు

౯౯౬౩ జవానులునుకలరు

సర్ఫెఖాసులో

౧౭౮ అధికారులును

౧౫౯౩ జవానులును కలరు.

---

## వ్యవసాయశాఖ

ఈశాఖద్వారా వ్యవసాయాభివృద్ధిమార్గములు ప్రజలకు చూపింపబడుచుండును. కొన్ని జిల్లాలలో నమూనా వ్యవసాయము చేలుపెంచి జనులకు బోధచేయ జూచుచున్నారు. నగరములో వ్యవసాయప్రధానశాఖకలదు. దాని అధిపతిని నాజిం (డైరెక్టరు)అందురు. ప్రతిజిల్లాలో ఈశాఖయొక్క ఒక ఇన్స్పెక్టరు (అధికారి)కలడు. అప్పుడప్పుడు వ్యవసాయ ప్రదర్శనములందంను చేయుచుందురు.

## పశువైద్యశాఖ

ప్రతిజిల్లాలో అనేక తాలూకాలలో పశువైద్యుల నేర్పాటు చేసినారు. వ్యవసాయ పశువులకును, గుర్రములకును, సంభవించు జాడ్యములకు ఈశాఖవారు ఉచితచికిత్సలు చేయుదురు.

## సదర్ మహాసబీ.

ఇది లెక్కలశాఖ. ప్రభుత్వముయొక్క ఆదాయవ్యయముల న్నియు, రాష్ట్రమునకంతయు జరుగు ఆదాయవ్యయము లీశాఖలో వ్రాయబడి లెక్కలు సిద్ధముచేయబడుచుండును. ప్రభుత్వమువారికి పన్నులు, కరోడిగిరి, ఆబ్కారీ మున్నగుమార్గముల వసూలగు ప్ర

వ్యము సర్కారీఖజానా (కోశము)లో నుంచుదురు. ఆ ఖజానాకూడ ఈశాఖ అధీనములోనే యుండును.

## పరిశ్రమలశాఖ (సనత్ వ హిర్ఫత్)

## Commerce and industries

ఈశాఖద్వారా రాష్ట్రముయొక్క వ్యాపారము, చేతిపనులు వగైరాల అభివృద్ధి కావింపబడుచుండును. వ్యాపారముకొరకై కొన్ని మార్కట్లు రాష్ట్రములో నేర్పాటుచేసినారు. మరియు పరిశ్రమలకై యెవరైన మిషనులను తెప్పించినవారికి అవసరమైన ద్రవ్యసహాయము చేయుదురు. మిషనులకై అప్పులిత్తురు. మరియు ప్రజలు ఏఏపరిశ్రమలలో వృద్ధిపొందవచ్చునో సలహాలిత్తురు. బాయిలర్లు, ఇంజన్లు, ఎవ్వరెవ్వరుపెట్టి, కార్ఖానాలు (పరిశ్రమాలయము)స్థాపింతురో వారు మొదలీశాఖనుండి అనుమతి పొందవలెను. అటుతర్వాత ప్రతిసంవత్సరము అధికారులు తనిఖీ చేసిపోవుచుందురు.

## దీవానీదఫ్తర్

ఈకచ్చేరి ఫైనాన్సు ఆఫీసులోనున్నది. ఇందు చారిత్రికసంబంధమైన రికార్డులు (కవిలెలు) ఉండును. పూర్వములో పరిపాలకులుఇచ్చిన జాగీరులు, మఖ్తాలు, ఇనాములు, మున్నగువాని సంబంధమగు సనదుల దాఖలాలు ఇచ్చట నుంచబడియున్నవి. పూర్వము లో ఈదీవానీ దఫ్తర్ రాజా రాయరాయాన్ బహద్దరుగారివద్ద యుండెడిది. తర్వాత దీనిని సర్కారువారు ప్రత్యేకముగా నీకచ్చేరీనిస్థాపించి తమ అధీనములో నుంచుకొనియున్నారు. ఇప్పుడుమాల్ దఫ్తర్ గూడ నిందులో చేర్పబడినది. (ఈ మాల్ దఫ్తర్ రాజా శివరాజ బహద్దరువారివద్ద పూర్వముండుచుండెను) అతియాతుశాఖలో ఇనామీ విచారణలో పూర్వపు సనదుల పరిశీలనకు ఈ దీవానీ దఫ్తరులో వెదకించి సాక్ష్యమగునవి తీసుకొందురు.

## టంకశాల, ఎలెక్ట్రిసిటీ

నగరములో టంకశాలకలదు. ఇందు టప్పాటికెట్లు (స్టాంపు లు)కోర్టుస్టాంపులు, హాలీనాణెములును, (పైస మొదలుకొని రూపా యవరకు) సిద్ధముచేయబడును. అష్రఫీ అను బంగారునాణెములు గూడ సిద్ధముముచేయబడును. మరియు ఇనుము, ఉక్కు, మున్నగు లోహములకరిగించి నానావస్తువులు చేయుదురు.

ఎలెక్ట్రిసిటీశాఖయనుపదందేకలదు. ఇది నగరమునకు ఎలె క్ట్రిసిటీని సప్లైచేయుచుండును. ఈశాఖకు అధికారి మింటు (టంక శాల) అధికారియే అయియున్నాడు.

## మాలూమాతె ఆమ్మా
## (ప్రభుత్వ ప్రకటనశాఖ)

ఈశాఖ క్రొత్తగా ౨ సంవత్సరములనుండి స్థాపింపబడినది. విశేషముగా నిందు పత్రికలపై నిగ్రానియుంచుట, విదేశీ స్వదేశీ పత్రికలలో నేమివ్రాయుదురో ముఖ్యముగా మన రాష్ట్రమును గురించి వ్రాయువిషయములను గమనించి అబద్ధవార్తలుండిన వాటిని సవరించి జనులకు తెలుపుట, మరియు ప్రభుత్వాజ్ఞలను ప్రజ లకు తెలియజేయుట మున్నగుకార్యములు చూడబడును. ఈరాష్ట్ర ములో ఈక్రింది విధముగా పత్రికలుకలవు.

| భాష | దినపత్రికలు | ఇతరపత్రికలు |
|---|---|---|
| ఉర్దూ | ౬ | చాలకలవు |
| కన్నడము | లేవు | లేవు |
| మహారాష్ట్రము | లేవు | ౧ |
| తెనుగు | లేవు | ౧ |
| ఇంగ్లీషు | ౧ | లేవు |

## రైల్వే

మొన్న మొన్నటివరకీరాష్ట్రముయొక్క అధీనములో రైళ్లు లేకుండెను. నిజాం గ్యారంటీడ్ స్టేటు రైల్వేయనునది ఇంగ్లీషు కంపె

నీ అధీనమందుండెను. ౫౫ సంవత్సరములక్రిందట అది కొనబడెను. ఇప్పుడది నిజాంస్టేటు రైల్వేఅను పేరుతో నున్నది. మరియు జి. ఐ. పీ రైల్వే మనరాష్ట్రములో రాయచూరు వాడీ గుల్బర్గామీదుగా బొంబాయికిపోవును. బార్సీలైట్ రైల్వే ఉస్మానాబాదు జిల్లాగుండ పోవును. మనరాష్ట్రములో మొత్తము రైల్వేలైను [౧౨౫౯]మైళ్లు అందు ౬౬౬ మైళ్ళు పెద్దలైనువి. ౬౨౪ చిన్నలైనువి.

కొన్ని జిల్లాలకు ముఖ్యముగా తెనుగుజిల్లాలకు కరీంనగరు మెదకు, నల్లగొండ జిల్లా ముఖ్యనగరములకు రైలుమార్గములింకను వేయలేదు.

## రిజిస్ట్రేషన్

ఈ కచ్చేరీలో చిరచరాస్తులయొక్క రిజిస్ట్రీ జరుగును. నగరములో సదరు కచ్చేరియు మరికొన్ని సబ్ రిజిస్ట్రారు కచ్చేరీలును కలవు. అనేక తాలూకాలలోనొక రిజిస్ట్రారు కచ్చేరీకలవు. కొన్ని తాలూకాలలో మున్సిఫున కేరిజిస్ట్రారు అధికారములిచ్చియున్నారు.

నగరములో ఈకచ్చేరీలకన్నింటికి ముఖ్యమగు కచ్చేరి ఇన్‌స్పెక్టరు జనరల్ రిజిస్ట్రేషన్ స్టాంపులది కలదు. రిజిస్ట్రేషన్ కచ్చేరీలన్నిటిలోను దస్తావేజులు ఉర్దూభాషలోనే వ్రాసి రిజిస్టరు చేయవలసియుండును. బ్రిటిషిండియాలో ఏ జిల్లాలో విశేషముగా నేభాష మాట్లాడుదురో ఆభాషలో దస్తావేజులువ్రాసి రిజిస్టరు చేయించవచ్చును

## టపా

మనరాష్ట్రములో టపా సౌకర్యములు తక్కువగానే యున్నవనవలెను. అనేక గ్రామాలకు టపాసౌకర్యములులేవు. వారము రెండువారముల కొకమారు అనేక గ్రామాలకు టపాపోవును. మన టపా రేట్లు బ్రిటిషిండియా టపా రేట్లకన్న చాల చౌకగానుండుట ముఖ్యమగు విశేషము. టపాశాఖ ద్వారా మనిఆర్డరు, వీ. పీలు,రిజిస్టరీజాబులు, కార్డులు, మామూలీజాబులు ఒకస్థలమునుండి

యింకొకస్థలమునకు తీసికొనిపోబడును. మన రాష్ట్రములో టెలి
గ్రాం ఇంగ్లీషుప్రభుత్వమువారి అధీనములోనున్నది. ఇప్పుడు రైలు
స్టేషనులుండు చోట్లకుమాత్రము టెలిగ్రాము లిచ్చుకొనవచ్చును.
బయట బ్రిటిషిండియా లేక విదేశములకు తారులిచ్చుకొనవలెననిన
నగరములోనుండు బ్రిటిషుతారు ఆఫీసుద్వారా యిచ్చుకొనవలెను.
నగరములో బ్రిటిషుటపాకచ్చేరీకలదు. బ్రిటిషిండియానుండి వచ్చు
టపావస్తువులను గ్రామములవారికి అందించుట కష్టము. పెద్దపెద్ద
జల్లా స్థలములలో బ్రిటిషుటపా ఉండిన అచ్చటివారికే ఏమైన అట్టి
సౌకర్యములుండును.

మనరాష్ట్రములో మొత్తము ౭౯౪ టపాఖానాలున్నవి.
౯౮౪ ఉత్తరాల డబ్బాలున్నవి. ఈప్రకారము లెక్కించి చూచిన
(౧౩౪౨ ఫ. లో) ౧౦౪ చదరపు మైళ్లకొక టపావంతున నున్నది.

## హైకోర్టు (అదాలతుల్ ఆలియా)

ప్రజల వివాదముల పరిష్కారార్థమై బ్రిటిషు హిందుస్థాన
ములో నేరీతి న్యాయస్థానములుకలవో ఇంచుమించు అదేపద్ధతిపై
మనరాష్ట్రములోకూడ కలవు.

ప్రతితాలూకాలో నొక మునిసిఫ్‌కచ్చేరియు దాని అధికారి
మునిసిఫున్ను,

ప్రతి జిల్లాలో మునిసిఫ్‌పై మురాఫాకచ్చేరీఅగు జిల్లాన్యా
యస్థానము దానిఅధికారి నాజిమున్ను

ప్రతిసూబాలో నాజిముపై మురాఫాకచ్చేరీఅగు సదరు
అదాలతున్ను దాని అధికారి సదరు నాజిమున్ను,

ఈ అదాలతుపయి మురాఫాకచ్చేరీ హైకోర్టున్ను కలవు.
(దీనినే అదాలతుల్ ఆలియా అందురు.) ఈ హైకోర్టు హైదరాబా
దు నగరములోకలదు. ఇందు (౯) రుకునులు (న్యాయాధికారులు)గల
రు. వీరిపయి ప్రత్యేకస్థితులలో మురాఫా జ్యూడిషియల్‌కమిటీలో
కలదు. న్యాయమును రెండువిధముల విభజించి యున్నారు. దీవానీ,

ఫౌజ్దారీ అని. దీవానీలో ఆస్తి, హక్కుల సంబంధమున్ను, చిరచ రాస్తుల సంబంధమున్ను మున్నగువిషయముల విచారణ జరుగును.

ఫౌజ్దారీలో అపరాధ విచారణ అనగా దొంగతనము, ఖూనీ మోసము, దెబ్బలు కొట్టుకొనుట, పరువునష్టము, రాజద్రోహము, బలవద్గమనములు మున్నగునవి విచారించి జైలుశిక్షలు లేక జుర్మానాలులేక కొరడాదెబ్బలుఉరిశిక్షలులేకఆస్తితీసికొనుశిక్ష విధింపబడును.

నగరము నకై దీవానీబల్దా కచ్చేరీలనియు, ఫౌజ్దారీబల్దా కచ్చేరీలనియు ప్రత్యేకముగా నేర్పాటుచేయబడినవి. బ్రిటిషిండియాలో మున్సిఫ్ కచ్చేరీల్లో ఆయా జిల్లాలభాషయే యుపయోగించబడుచున్నది. కాని మన రాష్ట్రములో సంతటను ఉర్దూభాషయే న్యాయస్థానములందు ప్రయుక్తము. ఇప్పుడు రాష్ట్రమంతటను గల న్యాయస్థానముల తనిఖీకిగాను ఇన్స్పెక్టర్ జనరల్ అను నధికారి ఏర్పాటు చేయబడినాడు. బ్రిటిషిండియాలో నేటికినిచేయబడని జ్యూడిషియల్ ఎక్జిక్యూటివ్ విభజన మన రాష్ట్రములో పదేండ్లక్రిందటచేయబడి అమలులోనుండుట ముఖ్యముగా ప్రశంసనీయమగునంశము.

ప్రత్యేకముగా మహమ్మదీయులకై తమ మత ప్రకారము (షరానుబట్టి) మతసంబంధమగు వ్యవహారములలో తీర్పుచేయుటకై నగరములో దారుల్ఖజా అను కచ్చేరీకలదు. దాని అధికారిని నాజిం అందురు. అందు మహమ్మదీయుల వివాహసంబంధ వ్యవహారములు భార్యల భరణములు, పురుషుల విడాకులు (తల్లాఖ్), భార్యలు భర్తలకు విడాకులిచ్చుట (ఖులా), మృతుని ఆస్తి వారసులనిర్ణయము, బీజనిర్ణయము, (అనగా ఫలానివాడు ఫలానివాని కొడుకగునా కాడాఅను నిర్ణయము) మహారు (ఓలి లేక ఉంకువ) మున్నగునవి తీర్పుచేయబడును.

హైకోర్టులో సార్వము ఖూనీచేసినవారిని శిరచ్ఛేదశిక్షకై హైకోర్టు జడ్జీలు అభిప్రాయ మిచ్చినప్పుడు షరా ప్రకారము చెల్లు

నా చెల్లదాయని తీర్పు చెప్పుటకై ముఫ్తీయను అధికారి ఒకడుం డెను. ఇప్పుడా యధికారిలేకున్నను, బ్రిటిషిండియాలోనుండు నొక ముఫ్తీకి నెలజీతమిచ్చి ఇప్పటికిని అతని అభిప్రాయము తెప్పించుకొ నుచుందురు.

మున్సిఫీ మున్నగు అధికారులఅధికారము లీక్రిందివిధముగా నున్నవి.

అధికారములు

| అధికారి | దీవానీ | ఫౌజ్దారీ |
|---|---|---|
| మునిసిఫ్ | రు. ౨౦౦౦ వరకు | ౨ సం॥ ల శిక్షవరకు |
| నాజింజిల్లా | (అ) మున్సిఫ్పై మురాఫా<br>(ఆ) రు. ౨౦౦౦౦ వరకు ఇబ్తిదాయీలో | మున్సిఫ్ ఆరునెలలశిక్ష యిచ్చిన దానిమురాఫా ౭ సంవత్సరముల శి |
| సదరునాజం | (అ) జిల్లా, ఇబ్తిదాయీ మొకద్దమాల మురాఫా<br>(ఆ) రు. ౨౦౦౦౦ పైన విలువగల కేసు లన్నియు | (అ) ఆరునెలలకన్న మించినశిక్ష మున్సిఫ్యిచ్చిన దాని మురాఫా<br>(ఆ) కమిటి అయిన మొ కద్దమాలలో ౧౪ సంవత్సరముకన్న మించిన శిక్షకున్ను శాశ్వత కారాగారశిక్ష మ రియు శిరచ్ఛేదన శిక్ష కున్ను హైకోర్టుఅభి ప్రాయార్థము పం పవలెను. |

హైకోర్టు (అ) నాజిం జిల్లాలో మున్సిఫీనుండి వచ్చినమురాఫా యేది అగునో అట్టి మురాఫా పయి మురాఫా హైకోర్టులో అగును.

(ఆ) మొదటిమురాఫా జిల్లానుండి సదరుఅదాలతుకు వచ్చిన అచ్చటనుండి రెండవమురాఫా హైకోర్టులో

అదాలతె ఖఫీఫా (దీనిని ఇంగ్లీషులో స్మాల్ కాజు కోర్టు) అందురు. ప్రతి జిల్లాలో ఈకోర్టులు లేవుగాని న్యాయాధికారులదక్షతనుబట్టి కొందరి మున్సిఫ్ఫులకు, నాజింలకు ఈఅధికారము ఇయ్యబడినది. ద్రవ్యపరిమితికూడ నిర్ణయము సేసి. నగరములో ప్రత్యేకముగా నొక కచ్చేరికలదు. ౨౦౦౦ రూపాయీల లోపలి మొకద్దమాలన్నియు నందు రుజువు కావలెను. దీనికి స్థిరాస్తులో సంబంధములేదు

ఆసారెఖదీమా పురాతత్వశాఖ

దీనిని ఇంగ్లీషులో ఆర్కియాలజీ అందురు. మరియుసంస్కృతములో ఆర్ష శాఖయనియు: పురాతత్త్వశాఖయనియు నందురు. ప్రాచీనకాలములో నిర్మింపబడిన దేవాలయములు, మసీదులు, కోటలు, గుహాలు, శిల్పములు, మున్నగునవి చెడిపోకుండునట్లుగా కాపాడునిమిత్తమై యీశాఖ ఏర్పాటు చేయబడినది. మనరాష్ట్రములోనున్నట్టి ప్రాచీనశిల్పములు హిందూస్థానములో మరెచ్చటను లేవనవచ్చును. జగద్విఖ్యాతములగు అజంతాగుహాలున్ను ఎల్లోరా గుహాలున్ను ఔరంగాబాదు జిల్లాలోకలవు. అజంతాగుహాలలో సుమారు ౨౨౦౦ ఏండ్లక్రిందట గుహాలలోని గోడలపైని గచ్చుపై రంగులతో చిత్రించిన అతి సుందరములగు చిత్తరువులు ప్రపంచమంతయు నాశ్చర్యపడునట్లు చేసినవి. అటేరీతి ఎల్లోరాలోని ౩౪ గుహాలలోని హిందూ జైన బౌద్ధశిల్పములు అసదృశములైనవి. మరియు, బిదర్, ఓరంగల్, శిల్పములు చాలప్రసిద్ధములు. గోలకొండ, దౌల

తాబాదు, దేవరకొండ, రాచకొండవంటి దుర్గములు చాల ప్రఖ్యాతమైన చారిత్రికపు కోటలుకలవు. ఈరాష్ట్రములో వివిధ సామ్రాజ్యములు వెలసెను. గోలకొండ, బిజాపూరు, కాకతీయ, యాదవ, శాలివాహన, రాష్ట్రకూటవంటి రాజ్యములు వెలసెను. ఇంతేకాక జైన, శైవ, మతములు విశేషముగా వ్యాప్తిపొందిన దీ రాష్ట్రమందే. అందుచేత ప్రాచీనరాజ్య చిహ్నములు, మత చిహ్నములు ఈ రాష్ట్రమున చాలవిలువకలవి కలవు. ఆర్క శాఖామూలముగా మన ప్రభుత్వమువారు ఈ ప్రాచీనపు కట్టడములను శిథిలముకాకుండ రక్షించుచున్నారు. మరియు ఈరాష్ట్రములో శిలాశాసనములు వేనవేలుకలవు. ఇవన్నియు చరిత్రకు ముఖ్యాధారములు. కన్నడములో, సంస్కృతములో, తెలుగులో, ఫార్సీలో, శాసనములుచాల కలవు. శాసనములను విశేషముగా నింకను ప్రభుత్వమువారు ప్రకటించుటలేదు. క్రమేణ ప్రకటించుచున్నారు.

మనరాష్ట్రములో ప్రాచీనశిల్పములు, శాసనములు, దేవాలయములు, కోటలు, ఇట్టివిచూచి యానందించి, ప్రాచీన చరిత్రకుపయోగించుకొనుటకు పనికివచ్చుస్థలములనుసూచించుచున్నాము.

| జిల్లా | ప్రాచీనస్థలము | ఉండుచోటు | విశేషములు |
|---|---|---|---|
| ఔరంగాబాదు | అజంతా | ఔరంగాబాదుకు ౬౦ మైళ్లదూరము | ౨౦౦౦ఏండ్లనాటిచిత్రపువులును గుహలును |
| రాయచూరు | అలంపూరు | అలంపూరురోడ్డు స్టేషన్ N. S. R. | ౨౦౦౦ ఏండ్లనాటి శైవాలయములు |
| ఔరంగాబాదు | ఔరంగాబాదు నగరము | స్టేషనుకలదు | ఆసఫ్జా, ఔరంగజేబు గోరీల గుహాలు |

| | | | |
|---|---|---|---|
| బిదరు | బిదరు | రైలుస్టేషన్ | కోట, అష్టద్వారములు, గోరీలు |
| ఔరంగాబాదు | దౌలతాబాదు | ఔరంగాబాదుకు ౧౧ మైళ్లదూరమున | కోట |
| ,, | ఎల్లోరా | దౌలతాబాదుకు ౭ మైళ్లలో | గుహాలు |
| హైదరాబాదు | గోలకొండ | నగరమునకు ౪ మైళ్లలో | కోట, గోరీలు, మసీదులు |
| రాయచూరు | ఇటుగి | కొప్పల్‌కు ౧౫ మైళ్లదూరమున | దేవాలయము |
| ఔరంగాబాదు | జాల్నా | స్టేషన్ | దేవాలయము మసీదులు, కోట |
| గుల్బర్గా | కల్యాణి | ,, | శిల్పములు |
| గుల్బర్గా | గుల్బర్గా నగరం | ,, | కోట, మసీదులు |
| నాందేడు | నాందేడు పట్టణము | ,, | సిక్కు దేవాలయములు |
| ఔరంగాబాదు | పైఠన్ (ప్రతిష్ఠాన పురము) | ఔరంగాబాదుకు ౨౦ మైళ్లు | దేవాలయములు మసీదులు |
| రాయచూరు | రాయచూరు పట్టణము | స్టేషన్ | కోట, శాసనములు |
| వరంగల్ | వరంగల్ హనుమకొండ | స్టేషన్ | కోటలు, శాసనములు, దేవాలయములు |
| కరీంనగరు | యల్లందల | కరీంనగరుకు ౨౦ మైళ్లదూరము | కోట |
| వరంగల్ | రామప్ప గుడులు | వరంగలుకు ౪౦ మైళ్లదూరము | దేవాలయములు |

| | | | |
|---|---|---|---|
| నల్లగొండ | పానుగల్లు | నల్లగొండకు ౪ మైళ్లదూరము | దేవాలయములు |
| ,, | ఎల్లలమర్రి | నల్లగొండకు ౩౦ మైళ్లు | దేవాలయములు |
| ,, | దేవరకొండ | ,, | కోట |
| | రాచకొండ | ,, | ,, |
| | కొలనుపాక | | జైనాలయములు |
| | భద్రాచలము | | దేవాలయములు |
| కరీంనగరు | వేములవాడ | | ,, |

## వి ద్యా శా ఖ

ఇదిచాల ముఖ్యమైనశాఖ. దీనిపై యిప్పుడు మన ప్రభుత్వము వారు ౧ కోటి రూపాయీలకు పైగా ప్రతిసంవత్సరము ఖర్చుపెట్టుచున్నారు. ౧౩౪౨ ఫసలిలో ౧ కోటి ౬ లక్షలరూపాయీలు ఖర్చుపెట్టినారు. ఇట్లుండినను మనరాష్ట్రములో నూటికి ౫ గురు మాత్రమే విద్యవచ్చినవారు. విద్యా శాఖాధికారిని నాజిం (డైరెక్టరు) అందురు. ప్రతిసూబాలో సదరు మొహతెమిమును, ప్రతిజిల్లాకు మొహతెమీమును కలరు. అతనిక్రింద నాజిర్ అను అధికారి యుండును. ఇతర దేశములలో ప్రభుత్వమువారేకాక ప్రజలును ప్రజాపక్షమున పాఠశాలలు నెలకొల్పి ప్రభుత్వమునకు తోడ్పడుచుందురు. మనరాష్ట్రములో ౧౩౨౮ ఫసలీలో ఖాన్గీ పాఠశాలల గష్తీయొకటి కావింపబడెను. దానిమూలమున ప్రజలు సర్కారువారి సెలవులేనిది (ఖాన్గి) బళ్లను నడుపకూడదనియు అట్లు నడిపిన పోలీసువారిద్వారా మూయింపబడుననియు ఆజ్ఞయయ్యెను. ఖాన్గీబళ్లగష్తీ వచ్చినతర్వాత వేలకొలది ప్రైవేటుబళ్లు మూయబడెను.

ఈరాష్ట్రములోని వివిధజాతులలో విద్యయెంతవరకుం

వేరుచో చూపించినాము.

| | బళ్ళసంఖ్య | విద్యార్థులు |
|---|---|---|
| ౧౩౩౩ ఫసలిలో గస్తీకిపూర్వము | ౪౦౫౩ | ౭౬౬౫౪ |
| ౧౩౪౨ ఫసలీలో ౮ ఏండ్ల అనంతరము | ౭౭౬ | ౨౭౫౦౬ |

సన్ (౧౩౨౭) ఫసలీలో ఉస్మానియా విద్యాపీఠము స్థాపింపబడెను. ఇదియేర్పడిన తర్వాత నొకగొప్పమార్పు జరిగెను. ఇంతవరకు బ్రిటిషిండియాలోని మద్రాసు, బొంబాయి, కలకత్తావంటి విద్యా పీఠములలో (యూనివర్సిటీలలో) ఇంగ్లీషుద్వారా బోధజరుగుచుండెను. మన ఉస్మానియా విశ్వ విద్యాలయములో ఉర్దూకు ప్రాధాన్యమిచ్చి దేశభాషలకను (ముల్కి జబాన్) ఇంగ్లీషునకు ద్వితీయస్థానమిచ్చిరి ఈరాష్ట్రములోని పాఠశాలలు అ దలివిద్యార్థుల సంఖ్య (౧౩౪౨ ఫ. లో) యీవిధముగా నుండినది.

| | | | |
|---|---|---|---|
| కాలేజీలు | [౧౦] | వ్యయము | రూ. ౧౧౫౬౭౫౦ |
| హైస్కూల్లు | [౫౦] | ,, | ౧౫౮౨౦౮౨ |
| మిడిల్ స్కూల్లు | [౧౨౮] | ,, | ౧౦౮౧౫౯౩ |
| ప్రైమరీ పాఠశాలలు | [౪౨౬౦] | ,, | ౨౪౨౮౯౭౧ |
| స్పెషల్ స్కూల్లు | [౬౨] | ,, | ౩౮౪౧౧౪ |

| | | |
|---|---|---|
| కాలేజీలలో | ఇంజనీయరింగుది | ౧ |
| ,, | వైద్య, మెడికల్ ది | ౧ |
| ,, | స్త్రీలది | ౧ |
| ,, | కళాశాలలు (Arts) | ౬ |
| ,, | న్యాయము (లా) | ౧ |
| ,, | కోబిల్ కాలేజి | ౧ |

౧౩౪౨ ఫ. లో విద్యార్థుల సంఖ్య

| | బళ్ళు | బాలురు | బాలికలు |
|---|---|---|---|
| కాలేజీలు | ౧౦ | ౧౪౨౭ | ౨౨ |
| హైస్కూల్లు | ౫౦ | ౬౪౨౧ | ౨౯ |
| మిడిల్ | ౧౨౮ | ౧౪౨౭౭ | ౮౧౬ |

| | | | |
|---|---|---|---|
| ప్రైమరీ | ౪౨౬౦ | ౨౪౬౬౨౩ | ౫౨౩౦౫ |
| స్పెషల్ | ౬౨ | ౩౮౦౯ | ౧౧౨౮ |

విద్యాశాఖవారు ఏటేట ఉత్తమపరీక్షలలో ఉత్తములుగా నుత్తీర్ణులైనవారికి యూరోపునకు ముఖ్యముగా ఇంగ్లాండునకు పోయి చదువుకొనివచ్చుటకు ఉపకారవేతనము లిచ్చుచున్నారు.

ఇంతేకాక మన ప్రభుత్వమువారి యౌదార్యము కేవలము రాష్ట్రమందే కాక విదేశములందును జూపింపబడుచున్నది. ప్రతిసంవత్సరము అలిగర్ విద్యాపీఠమునకు ౬౦,౦౦౦ రూపాయిలున్ను పానిపట్టు ముస్లిం పాఠశాలకు సాలీనా ౩౦౦౦ లున్ను ఢిల్లి జామె మిల్లియాకు—౫౦౦౦౦ లున్ను యిచ్చినసంస్థలు ముఖ్యముగా పేర్కొనదగినవి.

మరియు లోకల్ ఫండులద్వారా అనేక గ్రామములో పాఠశాలలు నెలకొలిపి మరికొన్నిటికి (ఇమ్దాదీ) సహాయము చేయుచున్నారు. ఉస్మానియా విద్యాపీఠమునకై ౩ కోట్ల రూపాయిలు ఖర్చుపెట్టి బంగ్లాలుకట్టుటకు సెలవిచ్చినారు.

ఉస్మానియా విద్యాపీఠమును నెలకొల్పునప్పుడు మన ప్రభువుగారు ఇచ్చిన ఫర్మానా చాలముఖ్యమైనది. అందు ఉర్దూద్వారా విద్యనేర్పుటకై సెలవిచ్చిరి.

క్రీ. శ. ౧౯౧౭ సం॥ లో సర్ అక్బర్ హైదరిగారు రాష్ట్రవిద్యా విధానములో మార్పుచేయుటకై ప్రభుత్వమువారికిని శ్రీ ప్రభువుగారికిని నొక జ్ఞాపిక ( Memorandum) పంపుకొనిరి. అందిట్లు సెలవిచ్చిరి.

“పరభాషలోని బోధవలన ఈలోపములు కలుగును. విద్యార్థుల మెదడుపై అధికమునుఅనవసరమునునగు భారమగును. విషయలోపము కలిగించి పరభాషలోని చిక్కులను స్వాధీనపరచుకొనుటలో స్వతంత్రబుద్ధిని చంపును. విద్యార్థులు తమమాతృభాషలోతవజనులకు విద్యాబోధచేయజాలకుందురు ..............

అంగ్రేజీవైద్యము ప్రధానమైనది. నగరములో మెడికల్ కాలేజి కలదు. అందు వైద్యము నేర్పబడును. అందుత్తీర్ణులైన డాక్టర్లను జిల్లాలలోను తాలూకాలలోను నియోగించుచున్నారు. ఇప్పుడు ప్రతి తాలూకాలోను ఒక వైద్యాలయమును ఒక డాక్టరును ఏర్పాటు చేసియున్నారు. నగరములో నొక గొప్పవైద్యాలయము కలదు. దానిపేరు ఉస్మానియా వైద్యాలయము. అందు గాత్రింబవళ్ళును వేలకొలది జాడ్యస్థులకు చికిత్స చేయుచుందురు. మరియు స్త్రీవైద్యశాఖద్వారా సినిమా నొకటి మోటారుతో తీసికొనిపోయి పల్లెలలో ఆరోగ్యపద్ధతులనుగురించి సినిమానుచూపించి బోధచేయుచున్నారు. నగరములో ఏటేట ప్లేగువచ్చుచుండును. మరియు చుట్టుపట్టుల జిల్లాలలోను ప్లేగు ప్రబలినది. ఈప్లేగు నివారణార్థము ఈశాఖవారు చేయుకృషి చేయుఖర్చు, చూపుశ్రద్ధ ప్రశంసనీయము. మలేరియాను నిర్మూలించుటకై వందలకొలదిబావులను పూడ్పించి, దోమలు విశేషముగానుండుతావులలో కిరోసిను మున్నగు నూనెలచల్లి చాల శ్రద్ధ తీసుకొనుచున్నారు. అదేవిధముగా గ్రామగ్రామములలో స్ఫోటకము (అమ్మవారు) టీకాలు ఉచితముగా తీయించి ప్రజలను రక్షించుచున్నారు. స్త్రీలకై ప్రసవశాలయొకటి నగరములో నేర్పాటు చేసినారు. కాని ప్రతిజిల్లాలో ఏలుండిన ప్రతితాలూకాలో ప్రసవశాలలను స్త్రీడాక్టర్లను ఏర్పాటుచేయుట చాలయవసరము.

అంగ్రేజీవైద్యమేకాక యూనానీ వైద్యముకూడ కలదని చెప్పితిమికదా! నగరములో చారుమినారువద్ద నొక గొప్ప యూనానీవైద్యశాల నిర్మింపబడినది. దానిపేరు నిజామియా దవాఖాన. అందు యూనానీమందులుచితముగా నియ్యబడును. మరియు నించుమించు ప్రతితాలూకాలోకూడ నొక యూనానీ హకీమును ఏర్పాటుచేసియున్నారు. లేదా ఏహకీమైన యుండిన నతనికి ఉపవృత్తి నిచ్చుచున్నారు.

ఈ రెంటికన్న అతిప్రాచీన వైద్యము హిందువుల ఆయుర్వేద వైద్యము. నూటికి ౯౦ వంతు గ్రామజనులు ఆయుర్వేద వైద్యుల చికిత్సలే పొందుచుందురు. ఈ వైద్యము చాల చౌక, జనులకు విశ్వాసము కలిగించు నట్టిది. ప్రభుత్వము వారు దీనినికూడ యూనానీవలె చూడవలసిన అవసరము చాలకలదు.

తామీరాత్

అనగా నిర్మాణశాఖ. సర్కారి పాఠశాలలు, వైద్యాలయములు, కచ్చేరీలు కట్టుట, చెరువులు, కుంటలు కట్టుట, రిపేరుచేయుట, నదులకు అడ్డముగా కతువలు వేసి కాలువలుతీయుట, బాటలు వేయుట, రిపేరుచేయుట ఈశాఖయొక్క ముఖ్యమగుపనులు మన రాష్ట్రములో ఈశాఖ వారు కట్టినట్టి ఉస్మానియా వైద్యాలయము హైకోర్టువంటి బంగ్లాలు, ఉస్మాన్ సాగరు, నిజాంసాగరు, హిమాయతుసాగరు వంటి ప్రచండమైన చెరువులు ఈశాఖవారిపనితనములే.

అబ్ పాషీ, డ్రెయినేజ్

ఈ రెండు శాఖలును పై తామీరాత్ శాఖాధీనములోనివే. చెరువులు, కాలువలునిర్మించుట, రిపేరుచేయుట త్రాగుటకు పొలములకు నీటిని సప్లైచేయుట జరుగును. రోడ్లు వేయుట, బంగ్లాలుకట్టుట యీ పబ్లికు వర్కు శాఖాపనులే.

నగరములోను జిల్లా పట్టణములోను మురికినీటిని వీధులలో పారకుండ కాలువలద్వారా ఊరిబయటకు తీసికొనిపోయి విడుచుటకై చేయునేర్పాటులు డ్రెయినేజి శాఖవి. ౧౩౪౨ ఫ. వరకు మొత్తముదాష్ట్రము లో ౪౧౭౧ మైళ్ళ రోడ్లునిర్మింపబడి యున్నవి

రాజకీయ శాఖ (Political Dept.)

మన ప్రభుత్వము వారికిని బ్రిటిషు ప్రభుత్వము వారికిని జరు రాజకీయ వ్యవహారములీ శాఖ ద్వారా జరుగుచుండును. దీని కారిని సదరుల్ మహాం అందురు. కార్యదర్శి, సహాయ

మున్నగు అధికారులతని యధీనులై పనిచేయుచుందురు. వైస్రాయి గారుగాని, బ్రిటిషు ప్రభుత్వమునకు సంబంధించిన గొప్ప అధికారులుగాని మనరాష్ట్రమునకు వచ్చినప్పుడు వారి సౌకర్యములీ శాఖవారే విచారించుకొందురు. "ఆమెరా" (సర్కారీ మోటార్లు) తో షాఖానా శ్రీవారి(భోజనశాల) బాగెఅమా(పురోద్యానము)సఫాయి (పురపాలకశాఖ) ఈశాఖా సంబంధములే.

సఫాయి (కార్పొరేషన్.)

ప్రత్యేకముగా పెద్దపెద్ద నగరాలలోని పారిశుద్ధ్యము,రోడ్లు, వెలుతురు సౌకర్యములు, నీటి సౌకర్యములు మున్నగువాని విచారణకొరకై యొక పురపాలకసంఘముండును. మద్రాసు, బొంబాయి, కలకత్తావంటి నగరములలో అనేక సంవత్సరములనుండి యీశాఖ ఏర్పడి ప్రజలపక్షమున ఎన్నుకొనబడిన అధిక సంఖ్యాక సభ్యులచే పాలింపబడెడు కార్పొరేషన్ అనునవి పనిచేయుచున్నవి. ఈ కార్పొరేషన్ వంటిదే మన హైదరాబాదు నగరములో సఫాయి అను పేరుతో పనిచేయుచున్నది. గత సంవత్సరమువరకు ఎన్నికల పద్ధతి మన సఫాయికిలేకుండెను. గత సంవత్సరమే యొకశాసనము సఫాయి శాసనము అనుపేర గావింపబడెను. దానిద్వారా నగరమును బస్తీలుగా (వార్డులు) విభజించి ప్రతి బస్తీనుండి యొకరిని నెన్నుకొనునట్లు శాసించినారు. ఎన్నుకొనుపద్ధతికే వోటుఅని ఇంగ్లీషులో అందురు. వోటుయిచ్చుటకు అందరికి అధికారములేదు. నెలకు ౭ రూపాయీలు పన్ను విలువగలయింటిలో నుండువారికిని ౧౮ సంవత్సరములపై బడినవారికిని గ్రాజుయేట్లకును వర్తకులకును జాగీర్దారులకును వోటు అధికారమిచ్చియున్నారు. ఇట్టివోట్లచే విశేషజనుల వలన ఎవ్వరెన్నుకొనబడుదురో వారు సఫాయిలో సభ్యులుగానుందురు. ఇప్పుడు మననగర సఫాయిలో ఈక్రిందివిధముగా సభ్యులున్నారు.

౧౩ జనులచే ఎన్నుకొనబడినవారు

౧ గ్రాజుయేట్ల పక్షమున

౧ వర్తకుల పక్షమున
౨ జాగీర్దారుల ,,
౩ పాయిగాల ,,
౧ పేష్కారీ ,,
౧ సాలార్జంగుస్టేటు ,,
౧౩ ప్రభుత్వము నియోజితులు
౧ అధ్యక్షుడు ప్రభుత్వ నియోజితుడు
౧ సర్ఫెఖాసు పక్షమున
౧ ఆదిహిందువుల పక్షమున ప్రభుత్వముచేతనామకరణమైనవాడు
౧ పార్సీల పక్షమున నామకరణమైనవాడు
౧ క్రైస్తవుల ,, ,,

అనగా ప్రభుత్వ సభ్యులు హెచ్చు ప్రజలపక్షమున వచ్చిన ప్రతినిధులు తచ్చుఅని విశదమగును,

ఈసఫాయీపనులను నడిపించునతనిని కమిషనర్ అందురు. ఈసఫాయిలో నగరమునకు సంబంధించిన ఆరోగ్య విషయములన్నియు చేరును. బాటలువేయించుట, దీపేరులోనుంచుట, ఊడ్పించుట, నీరు సప్లైచేయుట వెలుతురు వీధులలో నుంచుట, మార్కెట్టులు తనిఖీచేయుట, మురికి నీటికాల్వల నేర్పాటుచేయుట మున్నగునవి.

ఈపనులకై బండ్లు, మోటారులు, సైకిళ్లు, మొదలగువాని పై పన్నులు వసూలుచేయుదురు. ఇండ్లపన్నులు తీసికొందురు.

ఆరాయిషెబల్దా (నగరాలంకారశాఖ)

(City improvement board)

ఆరాయిషెబల్దా—అనగా నగరాలంకారశాఖ. కేవలము హైద్రాబాదు నగరాభివృద్ధికై యీశాఖ యేర్పాటుచేయబడినది. ఈశాఖద్వారా వీధులు వెడల్పుచేయుటకై యిండ్లుకొని పడగొట్టించి మంచి సిమెంటు టారురోడ్లను చేయుట, మొహల్లాలు మున్నగునవి జరుగుచున్నవి. నాంపల్లి, మలకపేట, వ ములలో వేలకొలది సిమెంటుఇండ్లు కట్టి ప్రజలకు కిరా యున్నారు.

న్నది. హైద్రాబాదు రాష్ట్రములో రెసిడెంటును ఉర్దూ రాజకీయ వ్యవహారములలో సాహెబె ఆలీషా బహాదరనియు, జనసామాన్యపు వ్యవహారములలో బడేసాబ్ అనియు, ఆబడేసాబుయొక్క కోటను బడేసాబ్ కోఠీ అనియు వ్యవహరింతురు

ఇట్లు లార్డువెలస్లీ కాలములో సబ్ సిడీయరీపద్ధతి ఏర్పడినను మన హైద్రాబాదులో అంతకుముందునుండి రెసిడెంట్లనియామకము అగుచుండినటు తెలియవచ్చెడి. మన రెసిడెంట్ల సిల్సిలా యీప్రకారముండినది.

మొదటి రెసిడెంటు, హాలెండుఅను నతడు ౧౭౭౯ క్రీ. శ. లోవచ్చెను. అతనిరాక గుంటూరు (సర్కారు) జిల్లాను నిజాము వద్దినుండి తీసికొనును ద్దేశమే. కాని యుద్దేశము పూర్తి కాలేదు.

రెండవరెసిడెంటు ౧౭౮౧--౧౭౮౪ లో నుండెను. అతనికాలమునను గుంటూరు నిజామునుండి వదలలేదు.

మూడవ రెసిడెంటు జాన్సన్. (౧౭౮౪--౧౭౮౬) ఇతని కాలములో నొక క్రొత్తపద్ధతి యేర్పడెను, నాటినుండి నేటివరకాపద్ధతి జారీఉన్నది. అదేమన జాన్సన్ వచ్చినప్పుడు నిజాముగారికి వెలగల సొమ్ములు, గుఱ్ఱములు మున్నగునవి అతడు నజరానా యిచ్చుకొనెను. కొన్నిదినములయనంతరము నిజాముగారు తిరుగా తమకట్నములను రెసిడెంటుకు చదివించుకొనిరి.

నాల్గవరెసిడెంటు సర్ జాన్ కెన్నవే. (౧౭౮౮-౧౭౯౩) ఇతనికాలములో మరొకక్రొత్తపద్ధతి ఏర్పడెను. నిజాముగారవలన మొగలాయి బిరుదములుపొందిన మొదటి రెసిడెంటు ఇతడే. ఇతనికి దిలావర్ జంగు అను బిరుదమియ్యబడెను.

ఏడవవారు మేజర్ విలియంకర్కుపాట్రిక్. ౧౭౯౩-౧౭౯౭ ఎనిమిదవవారు పైవారి తమ్ముడగు కర్నల్ అకిల్లిస్ కర్కుపాట్రికు ?—౧౮౦౫) ఇతనికి హష్మత్ జంగు బిరుదము ఇయ్యబడెను.

ఇతనికి చాదర్ఘాట్‌లో నొక బంగ్లా నివాసార్థ మేర్పాటుచేయబడెను. ఇతని కాలమువరకు నిజాంప్రతినిధియొకడు కలకత్తాలో నివసించు చుండెను. ఈపద్ధతి నిలిపివేయబడెను. ఈ రెసిడెంటు కంపెనీపక్షము నను, నిజాంపక్షము నను ప్రతినిధిగా నేర్పడెను. ఇతని కాలములోనే ఇప్పటి రెసిడెన్సికోఠీకి కట్టబడెను. ఈకోఠీకథవినోదమైనది. తనకు కావలసిన స్థలమును ఒకపెద్ద నక్షాచేయించి నిజాముగారి యనుమతికై రెసిడెంటుతీసుకొనిపోయెను. నిజాముగారు నక్షాను ఎగదిగ చూచిమంజూరుచేయకపోయిరి. రెసిడెంటు ఖిన్నుడై వాపసుపోవుచుం డగా ప్రధానమంత్రి అతనితోనిట్లనెను "తాము నిజాంరాష్ట్రమంత నక్షాను సిద్ధముచేసుకొనివచ్చుటచే రాష్ట్రములో చాలభాగము మీరే తీసుకొనుచున్నారని యజమానులు తలచినారు. మీనక్షాను చాలచిన్నదిగా వ్రాయించుకొని తీసుకొనిరండు" ఈమాటలు నిజమో అబద్ధమో అయినను అట్లుకూడ చేసిచూతమని మంత్రిసలహా ప్రకారము రెండవమారు చిన్ననక్షాను తీసికొనిపోగా నిజాము వెంటనే సెలవిచ్చిరట. ఈ రెసిడెంటు మెహరున్నిసా అను ఒక ముసల్మాను స్త్రీని ప్రేమించి మహమ్మదీయపద్ధతి ప్రకారమామెను పెండ్లాడెను. ఆమెకై రెసిడెన్సికోఠీలో రంగమహల్ అను బంగ్లా కట్టించెను. అది యిటీవలనే పడగొట్టబడెను. ఇతనిని రాష్ట్రజనులందరు ప్రేమించెడివారట. నిజాముగారు ఇతనికి హష్మత్ జంగు బిరుదమే కాక ఫర్జందె మొహబ్బతె పైవంద్ (ప్రేమలగ్నతనయుడు) అనుబిరుదమునుగూడనిచ్చెను. (హష్మత్ గంజు అనునది యితని పేరనే కట్టబడినది)

తర్వాత కెప్టన్ సిడన్హాం రెసిడెంటయ్యెను, ౧౮౦౬-౧౮౧౦.

తర్వాత సర్ హెన్రీరస్సల్. ౧౮౧౦-౧౮౨౦. ఇతనికిసాబిత్ జంగు బిరుదమియ్యబడెను. తర్వాతిరెసిడెంటు సర్ చార్లస్ మెట్‌కాఫ్. ౧౮౨౦-౧౮౨౫ ఇతనికి ముంతజిముద్దౌలా అను బిరుదమి య్యబడెను. ఇతడే కట్టకడపటి మొగలాయి బిరుదందిన

తర్వాతి రెసిడెంట్లకు ఈ గౌరవము నేటివరకు దొరకలేదు. ఇతని తర్వాత అనేక రెసిడెంట్లువచ్చిరి. ఇప్పటివారు మెకెంజీగారు.

## పాయగాలు, సంస్థానములు, జాగీరులు.

ఇదివరకే వీటి స్వరూపవిషయమై కొంత సూచించియున్నాము. ఇప్పుడు వాటి వివరములను మరికొంత తెలిపెదము.

ఈ రాష్ట్రములో చిన్నవి, గొప్పవి, జాగీర్లువగైరాలు చాల కలవు. అవి ఈ క్రిందివిధముగా నున్నవి.

| జాగీర్ల సంవత్సరాదాయము రూపాయీలు | సంఖ్య: హిందువులవి | సంఖ్య: ముసల్మానులవి |
|---|---|---|
| ౧౦ నుండి ౫౦ వరకు | ౧౦౦ | ౪౨ |
| ౫౦ ,, ౧౦౦ ,, | ౧౦౦ | ౪౨ |
| ౧౦౦ ,, ౫౦౦ ,, | ౨౫౧ | ౧౬౧ |
| ౩ ,, ౫౦ ,, | ౬౫ | ౭౨ |
| ౫ ,, ౬ ,, | ౨౫ | ౨౨ |
| ౬౦౦౦ ,, ౧౦౦౦౦ ,, | ౨౦ | ౭౨ |
| ౧౦౦౦౦ ,, ౧౨౦౦౦ ,, | ౧౦ | ౨౩ |
| ౧౨౦౦౦ ,, ౧౫౦౦౦ ,, | ౨౦ | ౨౪ |
| ౧౫౦౦౦ ,, ౫౦౦౦౦ ,, | ౨౦ | ౫౯ |
| ౫౦౦౦౦ ,, ౧ లక్ష ,, | ౬ | ౫ |
| ౧ లక్షకన్న హెచ్చువి | ౭ | ౧౨ |
| ౧౦౦౦ ది నాందూ. ముసల్మానులు కానివారికి | ౧ | |

మొత్తము ౧౧౬౭ జాగీర్లు

ఈ జాగీర్లలో ముఖ్యముగా పేర్కొనదగినవాని వివరములు ఈక్రింద నియ్యబడుచున్నవి.

10

| జాగీరు పేరు. | | జాగీరు | అవియుండు స్థలములు | సంవత్సరాదాయము |
|---|---|---|---|---|
| దుబ్బాకుల | సంస్థానం | ౪ | మెదకు జిల్లా సిద్దిపేట తా. | ౨౬౬౩౯ |
| రాజాపేట | ,, | ౯ | నల్లగొండ జిల్లా భోనగిరి తా॥ | ౨౮౯౮౨ |
| వెంకటరాజూబాయి (ఎల్లారెడ్డిభార్య) | ,, | ౨ | నిజామాబాదు జి॥ కామారెడ్డి తా॥ | ౩౬౬౩౦ |
| రఘూత్తమరావు | ,, | ౧౧ | పర్భణీ | ౩౭౬౦౬ |
| సీర్నపల్లి | ,, | ౨౩ | నిజామాబాదు జి॥ | ౪౧౦౦౫ |
| పంపీర్జంగు | ,, | ౩౧ | మెదకు వగైరాలలో | ౪౪౭౮౩ |
| పాపన్నపేట | ,, | ౭ | మెదకు జి॥ అందోలు తా॥ | ౫౩౦౭౫ |
| గుర్గుంట | ,, | ౪౩ | రాయచూరు జి॥ లింగ్సూగూరు తా॥ | ౫౩౦౭౫ |
| రాపురంభా | ,, | ౪౪ | ,, ,, ,, ,, | ౭౨౪౩౦ |
| గోపాలపేట | ,, | ౩౬ | మహబూబునగరం జి॥ నాగరకర్నూలు తా॥ | ౭౩౪౭౭ |
| కాముద్దీన్ ఖాన్ | ,, | ౬ | నాందేడ్ వగైరా | ౭౫౪౨౫ |
| గొండ | ,, | ౧౬ | నిజామాబాదు జి॥ కామారెడ్డి తా॥ | ౭౭౫౩౦ |
| | ,, | ౭౧ | వరంగల్ | ౮౧౩౯౮ |

• పూర్వము మహమ్మదీయ పరిపాలకులు తాము జయించిన రాజులనుండి ప్రతిసంవత్సరముఒక నియమితమగుపన్నును వసూలుచేయు చుండిరి. అంతేకాని తమ సామంతుల పరిపాలనలో వ్రేలుపెట్ట కుండిరి. ఇట్టిపన్నును పేష్కష్అనిరి. మనరాష్ట్రములో పేష్కష్ గుజారులు ముగ్గురే,

| పేష్కష్‌గుజారు | | పేష్కష్ మొత్తముసాలీనా |
|---|---|---|
| గద్వాల | రూ. | ౮౬౫౪౦ |
| ఆనెగొంది | ,, | ౧౦౦౦౦ |
| గుర్గుంట | ,, | ౭౦౫౦ |

మరియు కొందరి జమీందారులనుండి ముక్తాపన్ను వసూలు చేయుచుండిరి. ఈక్రిందివారు ముక్తాపన్నులు ప్రభుత్వమునకిచ్చుకొను వారు:

| ముక్తాపన్ను యిచ్చువారు | | పన్ను మొత్తముసాలినా |
|---|---|---|
| వనపర్తి | రూ. | ౮౩౮౬౨ |
| జటప్రోలు | ,, | ౭౧౯౪౪ |
| గోపాలుపేట | ,, | ౨౨౬౬౩ |
| భద్రాచలం | ,, | ౪౫౮౭౫ |

ఆదాయములలో అనేక సంస్థానములవారు కేవలము శిస్తు భూమిపన్నుమాత్రమే చూపించినారు. అబ్కారీ, అడవులు, ఇతర మార్గముల ఆదాయము చూపించలేదు. అందుచేత గద్వాల,జటప్రో [illegible] తక్కువగా కనబడుచున్నది.

౪. పాలంపట్:—పాలెం [illegible]

౫. ఉమ్లీ:—పూర్వము దేశముఖులు, దేశపాండ్యాలు [illegible] చి అనేకగ్రామాలను తమ అధీనములో చేర్చుకొన [illegible] మీరకమిషన్ విచారణలో వారికి సనదులులేన [illegible] తిక భాగము జప్తుచేసి పాతిక "తిరిపము" గ [illegible] పము అనుపదమునకు ఇంగ్లీషులో అ [illegible]

# సర్ఫేఖాసు

సర్ఫేఖాసువిషయములో నిదివరకే, కొంత తెలిపియున్నాము ఇప్పుడింకను కొన్నివివరములు తెలిపెదము. సర్ఫేఖాసు అనగా ప్రత్యేకముగా యజమానులగు నిజాంప్రభువుగారి సొంతఖర్చునిమిత్తమేర్పడిన భాగములని అర్థము.

హిందూస్థానములో ప్రాచీనమునుండియు హిందూమహమ్మదీయ ప్రభువులలో తమ సొంతఖర్చుల నిమిత్తమును, తమ ఆప్తబంధువుల జీవననిమిత్తమును కొన్ని జాగీరులను ప్రత్యేకించు నాచారముండెను. మొగలాయి చక్రవర్తులును తమ సొంత వ్యయమునకై "హావేలీలు" అను సేర భూములను ప్రత్యేకించియుండిరి.

ఈరాష్ట్రములో పూర్వపు నిజాములఖర్చులుదీవానీ ఖజానానుండి యియ్యబడుచుండెను. కాని నవాబు నసీరుద్దౌలాబహద్దరు కాలములోనే కొన్ని తాలూకాలు దీవానీనుండి విడదీయబడి ప్రభువుయొక్క సొంత నిగ్రానీలోనికి తేబడెను. అప్పటినుండియే సర్ఫేఖాసు ప్రారంభమయ్యెను. తర్వాతికాలములో క్రమక్రమముగా నీక్రిందివికూడ సర్ఫేఖాసులో చేర్చబడెను.

౧. మఖ్తాలున్ను ప్రత్యే (పన్నయు సేరీలే) బగాలభూమి అని యుకరు అర్థముచేసినారు. ఇదియు సేరీలవలె జమీందారుల సొంత ఇనాములు. వరం అనగా భాగము. పూర్వము జమీందారులు తమ భూముల నితరులకిచ్చి తమ "స్వామిభాగము" హక్కును తీసుకొనుచుండిరి. అందుచే అట్టి భూములకు సావరంఅనిరి.

భటమాన్యము:— భట్టు అనపండితుడు. పండితుల(మాన్యము) మన్నకై యియ్యబడిన భూములు. పూర్వపురాజులీమాన్యములు విశేషముగా నిచ్చుచుండిరి.

రోజీనా:— అనగా దినబత్తెము. సాధారణముగా పూజారుల

# కొన్ని పదముల వివరములు

ఈ గ్రంథములో కొన్ని ఉర్దూపదములు వ్రాయవలసిచ్చినది. ఇచ్చటి వ్యవహారపదములనే యుపయోగించిన జనులకర్థమగునని యిట్లు వ్రాయబడినవి. అయినను ఆపదముల నెరుగనివారికొరకై ఉర్దూ తెనుగు ఇంగ్లీషుభాషలలో వాని పర్యాయపదములనిందు వ్రాయుచున్నాము.

| ఉర్దూ | ఇంగ్లీషు | తెనుగు |
|---|---|---|
| సీగార్ మజ్లిస్ | Chief justice | ప్రధాన న్యాయమూర్తి |
| రుకన్ | Judge (H. C.) | ఉన్నతన్యాయస్థాన న్యాయమూర్తి |
| మాల్గుజారీ | Revenue | భూమ్యాదాయశాఖ |
| నాజిం | Director, judge | శాఖాధికారి, జిల్లా న్యాయాధికారి |
| ఫైనాన్సు | Finance | ఆర్థికశాఖ |
| మోతెమద్ | Secretary | కార్యదర్శి |
| కిరోడ్గిరి | Customs | సుంకము |
| బటావర్ | Exchange | మారకము |
| ఆబ్పాషి | Irrigation | నీటివసతులశాఖ |
| సదర్ఆజం | Prime minister | ప్రధానమంత్రి |
| సదరుల్మహాం | Member | శాఖామంత్రి |
| తామీరాత్ | P. W.D. | నిర్మాణశాఖ |
| అదాలత | Justice | న్యాయశాఖ |
| సియాసియాత్ | Political Department | రాజకీయశాఖ |
| సియాసి | ,, | సియాసియాత్ యొక్క విశ్లేషణము |
| మహాం పేషీ | | మ. ఘ. వ. శ్రీ ప్రభువు గారి సమక్షములో |

| ఉర్దూ | ఇంగ్లీషు | తెనుగు |
|---|---|---|
| బాబెహుకూమాత్ | Executive Council | కార్యనిర్వాహకసభ ప్రభుత్వసభ |
| అతియాత్ | Atiat (Inams) | ఇనాములసంబంధపుశాఖ |
| షరీక్ మూతెమద్ | Joint Secretary | షరీకు అనగా సంయుక్తుడు సంయుక్త కార్యదర్శి |
| నాయబ్ మోతెమద్ | Deputy Secretary | ప్రతినిధికార్యదర్శి |
| తిజారత్ | Commerce | వ్యాపారశాఖ |
| ముషీరెఖానూన్ | Legal adviser | ప్రభుత్వమునకు న్యాయ శాస్త్రములో సలహా నిచ్చు అధికారి |
| సధర్ మహాసబ్ | Accountant General | లెక్కల పెద్దఅధికారి |
| అవ్వల్ తాలూక్దారు | First grade Collector | (అవ్వల్ అనగా మొదట) జిల్లాధికారి |
| దువ్వం తాలూక్దారు | Second grade Collector or Deputy Collector | (దువ్వం అనగా రెండవ) |
| మురాఫా | Appeal | పునర్విమర్శ |
| బందోబస్తు | Settlement | భూములకొలత |
| జంగ్లాత్ | Forest | అడవి |
| తరక్కీయా తెఆమ్మ | Development Dept. | అభివృద్ధిశాఖ |
| ఆసారెఖదీమా | Archaeological Dept. | పురాతత్వశాఖ |
| ఫౌజ్ | Military | సైన్యము |
| తిబాబత్ | Health | ఆరోగ్య |
| సఫాయి | Corporation | పుర |

| ఉర్దూ | ఇంగ్లీషు | తెనుగు |
| --- | --- | --- |
| ఆరాయిషెబల్దా | City Improvement Board | నగరాలంకారశాఖ |
| దారుల్ఖజా | Ecclesiastical | ఖాజీ న్యాయస్థానము |
| ఉమూరె మజహబీ | Religious Dept. | మతశాఖ |
| సనత్ వ హిర్ఫత్ | Commerce & Industries | వాణిజ్యపరిశ్రమల శాఖ |
| ముంతజిం అమ్లాజ్ | Police Sub-Inspector | తాలూకా పోలీసుఅధికారి |
| మాలూమాతెఆమ్మా | Information Bureau | ప్రభుత్వ ప్రకటనశాఖ |
| అదాలతుల్ ఆలియా | High court | ఉన్నతన్యాయస్థానము |
| సదర్ అదాలత్ | Sessions Court | సూబా న్యాయస్థానము |
| తనక్కీ | Inspection | పరిశీలనము |
| ఇబ్తిదాయీ మొకద్దమా | Original Suit | |
| అదాలతె ఖుఫీఫా | Small Cause Court | అల్పాభియోగ న్యాయస్థానము |
| మొహతమీం | Superintendant | |
| సదరుమొహతమీం | Chief Superintendant | |
| ఖాస్గిపాఠశాల | Private School | |
| గష్తీ | Circular | |
| ఇమ్దాదీపాఠశాల | Aided School | ప్రభుత్వసహాయముపొంద పాఠశాల |
| | Festival | ముసల్మానులపండుగ |

